ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికాశికము. సంఖ్య-౩౦.

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.



వెన్నెలకంటి అన్నయ్యకవి.

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము. సంఖ్య-౩౦.

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

ఇది

వెన్నెలకంటి అన్నయ్యకవిరచితము.




రెండవకూర్పు ౧౦౦౦.

కాకినాడ:

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటితము.

వెల 0-8-0.

సిటీప్రెస్, కాకినాడ.

1934.

గ్రంథాకృతి:— ఈకవి దశకుమారచరిత్రమును మనస్సున నుంచుకొని యీ షోడశకుమారచరిత్రమును రచియించెను. కొన్ని కథలను కథాసరిత్సాగరాదులనుండి సంగ్రహించి ఆ కథలను వివిధరీతుల ప్రాకృతిచే సమష్టిని వర్ణనైక్యమును గలిగించి జనమేజయుని రెండవకుమారుని కథానాయకునిగఁ జేసి. అతనికిఁ దోడుగ వలెవి మంత్రితనయులను, పురోహితపుత్రులను, దండనాథసుతులను, పదేనుగురను గూర్చి కథ సాగించినాఁడు. కావున నందుచేఁ గల షోడశరాజకుమారచరిత్ర మనుపేరు చెల్లును. ఒక్క తావున షోడశనందనచరిత్ర మని యున్నది. దానికి బాధ లేదు.

కవిత్వము నిర్దుష్టమైనది. ఉభయభాషాప్రౌఢి మెఱయుచున్నది. శైలి మంచన కేయూరబాహుచరిత్రమును, జక్కన విక్రమార్కచరిత్రమును, కేతన దశకుమారచరిత్రమును బోలుచుండును. పద్యములు హృద్యములై ధారాశుద్ధి గలవిగా నున్నవి. ఎవ్వరియొద్దనైన సంపూర్ణప్రతి యున్నచో దయతోఁ బంపి యీ షోడశకుమారచరిత్రమును బూర్ణముగాఁ బ్రకటించుభాగ్యమును వా రాంధ్రసాహిత్యపరిషత్తునకుఁ గల్గింతురుగాక.

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన కథా
కల్పవల్లికామతల్లికకు నాలవాలం బగు హస్తినాపురం బెట్టి
దనిన. ౧

గీ. ఆది            ప్పురమునఁ
గాఁపురంబుండఁగాఁ జూడఁ గడలి వచ్చి
కోటసారరాక కూఁతుపైఁ గూర్మిఁ జుట్టు
వారియున్నట్టు లొప్పారి పరిఖ మెఱయు. ౨

గీ. అక్షయఖ్యాతి నెంతయు నందమొంది
యమల కమలోదయస్థాన మనఁగ వెలసి
కువలయప్రియహేతువై కొమరుమీఱి
యలరు నప్పురిపరిఖ దుగ్ధాబ్ధిభంగి. ౩

గీ. మహిత సన్మార్గవర్తన మాన్యులనఁగఁ
బొలుచు నినరాజకవిగురుబుధులనైనఁ
దగులువడఁజేయు పెంపునఁ దనరు వీటి
కోటకొమ్మలు తారకాస్ఫోటనములు. ౪

సీ. ధామాద్భుతోద్దామహేమకుంభంబులు
తరణిమండలముతోఁ దడఁబడంగ

నవకాంచనాకృతి ప్రజ్వలరత్నంబు
లలితతోరణములఁ గలసి పెరయఁ
ప్రమదకేళీలోలబాలముఖేందులు
చంద్రబింబంబుతో సరసమాడఁ
గగనరత్నవిభాసిఘనచంద్రశాలలు
ఖచరవిమానసంఘములఁ గలయఁ
చారుమాణిక్యమణిమయతోరణముల
బహుమనోహరచిత్రసంపదల మహిత
విభవములతోడ నెంతయు విస్తరిల్లు
సురపురం బన హస్తినాపురవరంబు. ౫

చ. అమరులకంటెఁ దత్పురి ధరామరవల్లభు లెక్కుడంట త
క్క్రమము తలపోయ నాగమవిధానములై తనరారు తారు ని
త్యము నొనరించు దానముల యజ్ఞములం బరితృప్తిఁబొంది
సం. భ్రమమునఁ దేలి వారు వడిఁ బ్రస్తుతిసేయఁగఁ బెంపుఁ
జెందుటన్. ౬

క. రాలెల్లను రత్నంబులు
చేలెల్లను రాజనంబుఁ జెఱకును బార
స్త్రీలెల్లఁ బద్మినులు పురి
శ్రీలను నుతియింప వశమె శేషున కైనన్. ౭

సీ. గిరులకెక్కులు ద్రుంచి గిరిభేది భూమిపైఁ
గ్రుమ్మరుఁ డనిన మేలొండ లనఁగ
హరుఁ డొకగజమూర్తి నణఁచుట నీసుచే
బహుగజాకృతులవైఁ బరఁగె ననఁగ

వెలవెల్లఁ బాటించి విడిచెడు గజములు
హరినీలమూర్తుల నమరె ననఁగ
జలధిని గిరులను నడయాడనొల్లక
మేఘబృందము లుర్వి మెలఁగెననఁగ
నున్న తాకృతి నెంతయుఁ జెన్నుమిగిలి
వందనీయ భద్రస్ఫూర్తి నందమొంది
వినుతసత్త్వంబులను దానవృష్టి మెఱసి
తనరు నప్పురి భద్రదంతావళములు. ౮

గీ. సిరులు మెఱసిన వారణాపురములోన
మెలసితిరిగెడుహయములమిసిమి చూచి
యినునితురగంబు లిలఁ గాలుకొనఁగ వెఱచు
వెల్లనై యుండు వేలుపువీటిహయము. ౯

చ. అరదము పూన్పనొక్కయెడ నప్పుడు నెక్కుడు...హయం
బులో, ఖరకరునశ్వముల్ ... ... ...
... ... నూడఁడు నెన్నఁడు నొమరయ్య్య
య, ప్పురిఁగల యుత్తమాశ్వములఁ బోఁడిగ నెక్కెడు వా
హకోత్తముల్. ౧౦

క. నవముక్తాతోరణములఁ
బ్రవిమలవజ్రాభిరామభవనముల సుధా
ధవళప్రాసాదంబు ...
... గనిండు ప్రభ నవ్వీటన్. ౧౧

గీ. నెఱయ నప్పురి వప్రాగ్రనీలమణుల
కాంతిసంగతి నాకాశగంగ యొప్పుఁ

పంచమున మింటిమీఁదఁ గాళిందితో
... ... ... ౧౨

సీ. ... ... తేనియల్
నించారఁ దొరగినన
సౌగంధికముల వాసనగల విరిసెటఁ
బ్రబలి కై వ్రాలినరాజనములు
నిరుపేదం జేలవోందు త ...
... ... ...
... ... ...
చిలుకలు చిందిన ఫలరసంబు
... ... కలును
గలిగి బహిరంగణంబులు పొలుపుమిగులు
జనుల కెల్లకాలంబు నామనియొకాఁగ
నాశ్వ......సేయు నలవియగునె. ౧౩

సీ. వా ... ...
... ంబు లెసకమెసఁగ
మెఱుఁగారుజేకులు నెఱదప్పి యొండొంటిఁ
గడవ సందడిపడి ...
... ... ...
కుత్తుకకోలఁదులు గ్రోలిగ్రోలి
అన్నా ... ంగమ్మ
పుష్పాడి తిప్పలఁ బారలిపారలి
చెలువుమిగిలిన యవ్వీటికోలఁకులందు
దాఁటులైకూ ... ...

... ... ...
మన్ననఁగని వెగడువాఁడఁ గ్రేళ్ళుదా ౧౪

సీ. రాజితపుష్పపరాగంబుఁ బరఁగించు
మదభృంగమోహనాస్వదత గాంచి
రమణీయ ... ...
... కలన మెఱయు
కర్పూరచందన ... ...
ణంబుల నాకర్షణంబుసేయు
వివిధకేళీలోల విటవిటీసురతశ్ర
మంబుల నుచ్చాటనం బొనర్చు
గర ... ...
... నెంతయుఁ గరముతోడ
మంద ... ...
... ... ... ౧౫

వ. అప్పురంబున కధీశ్వరుండు. ౧౬

సీ. లీల వేల్పులనెల్ల నసినవాజిలో
ముక్కంటిగెల్చి విఖ్యాతి
... ... .
... గా నేరాజుతాతతండ్రి
దర ... ... గెలంచె
రారాజులబలము నేరాజుతాత
కాలికాలములయందున ...
... ట్టి రాజాన్వయఖ్యాతుఁ డహిత

యమర సతివయు మగవాఁడు నైనవేల్పు
దనపాడవుఁ గలలోన సాదముగఁ జూపి
రమణ మీఱంగ నొక్కయరంటిపండు
నేలజేని తెఱవ కిచ్చె నెమ్మితోడ. ౩౧

వ. అట్టి మేలికలఁ గని యాక్షణంబునన మేలుకని యయ్యతివ తనప్రాణవల్లభునకుం జెప్పుటయు నతం డుల్లంబున నుల్లసిల్లి నీ కొక్కపుత్రరత్నం బుదయించు నని చెప్పి యానందకందళితమానసుం డగుచున్నంతఁ గొన్ని దివసంబులకు నెల మసలిన. ౩౨

సీ. మానినీరత్నంబుమధ్యంబుతోడన
వలుద లై యూరులు చెలువు మిగిలె
సుదతీలలామంబుచూచుకంబులతోన
యారు గప్పారె యొప్పారఁ దోడఁగె
నలినీలకుంతలయంగవల్లికతోడఁ
బలుచగాఁ జెక్కులు పలుకఁబాఱె
శీతాంశుబింబాస్యచెయ్వులతోడన
నలసంబు లయ్యె నేత్రాంచలములు
జలజలోచననడపుల జడను దోఁచెఁ
జామనెమ్మదిఁ గోర్కులు సందడించెఁ
దరుణినాలుక చవులకు నెరవుపడియెఁ
జెన్ను దఱుఁగుచు గర్భదశ్రీకతమున. ౩౩

చ. అలసము లయ్యెఁ జెయ్వు లనయంబుఁ బ్రియం బొనరించెఁ జూడ్కికి, న్నలుపును జెంది యుండియు మనఃప్రమదావహ మయ్యెఁ జన్నుదో, య్వెలవెలఁబాఱియుండియు నవీనవిలా

నతివలు శోభనాకృతులు చల్లకమున్న
సురపుష్పవర్షము ల్గురియుఁదొడఁగె
బ్రాహ్మణాశీర్వాదరావంబునకు మున్న
యనిమిషకోటి దీవనలు దోఁచెఁ
బొలసి దక్షిణపవనుండు వెలసె దిశల
హవ్యవాహనుఁడు ప్రదక్షిణార్చి యయ్యె
జనవరుఁడు వేడ్కఁ బ్రియ మందె సకలలోక
మోదకర మైన యక్కుమారోదయమున. 30

వ. అట్టి మహోత్సవమున జనమేజయమహీనాథుండు నానావిధ దానంబులుఁ గామితవస్తుత్యాగంబులు బంధమోక్షణంబులు జపహోమంబులు నొనరించి సముచితపరివారుండై కుమారునకుం గమలాకరుం డనునామం బిడిన మొదలిపక్షంబున విదియచందురుం బోలె ననుదినప్రవర్ధమానుం డగుచు ముద్దుఁబలుకులు పచరించుచుండ. 31

చ. హృదయము లుబ్బ నొండొరుల కిట్టివిధం బని చెప్పఁబంపుచుఁ, మృదుమధురంపు టాటలను మేనలరంగను గౌఁగిలించుచు, నమ్మదితయు నాథుఁడుం గొడుకుముద్దులఁ దేలన కాని మెన్నఁడు, నమ్మదిని దలంప రంచితరమావిభవోజ్జ్వల రాజ్యభోగముల్. 32

వ. ఇట్లతిగౌరవంబునం బెరుపం బెరిఁగి సముచితసమయసమాచరితచౌలోపనయనుం డై. 33

సీ. వేదవేదాంగము ల్వివిధపురాణేతి
హాసము లుత్కృష్టధర్మార్థశాస్త్ర

ములును వాయుర్వేదమును ధనుర్వేదంబు
భరతశాస్త్రంబును బంచబాణ
శాస్త్రంబు కామందపాణక్యభార్గవ్య
కౌణపదంతిముఖ్యప్రదీప
భూపాలనయశాస్త్రములు శిల్పిశాస్త్రంబుఁ
గావ్యము ల్లక్షణగ్రంథములును
నాటకంబులు నష్టనానాకశాస్త్ర
పంచమును నలవడంగ శీలించి దుష్ట
కుంజరరథాశ్వరోహణకళలఁ బ్రౌఢి
మాధిఁ జెన్నొందె మిగులంగఁ బ్రౌఢి మెఱసి. 34

వ. నవయౌవనంబు నొందుసమయంబున జనమేజయజననాథుం
డు రాజకుమారానీకశేఖరుం డగు శతానీకుని నిజరాజ్యం
బునకు నభిషిక్తునిం జేసి యక్కమలాకరకుమారునకు యౌ
వరాజ్యపట్టంబు గట్టి సమస్తంబు నప్పగించి తానును దేవి
ద్వయంబును దపోవనంబున కరిగిన. 35

క. లోకోన్నతగరిమ శతా
నీకుఁడు రాజ్యంబు బొనర్ప నెమ్మిని యువరా
జై కమలాకరుఁ డురువిభ
వాకరుఁడై యనుదినంబు నన్నం గొలుచున్. 36

సీ. అంగహీనతయును హారవిరోధము మాని
కనుపట్టు మకరకేతనుఁ డనంగ
వనవాసమును గృష్ణవర్ణత్వమును మాని
విలసిల్లు నిందిరావిభుఁ డనంగ

బహుగుఁజడంబును నొడలికంపమును మాని
సంపూర్ణరుచినొప్పఁ జంద్రుఁ డనఁగ
ఘనపిధానంబును ఖరకరత్వము మాని
తనువుమైఁ బెనుపొందు తపనుఁ డనఁగ
రూపతనుకాంతి లక్ష్మీప్రతాపమహిమ
లఖిలవర్ణనీయంబులై యతిశయిల్ల
పావనోజ్జ్వలతరమూర్తి నందమొందు
నఖిలకమలాకరుఁడు కమలాకరుండు. ౩౭

మ. జగదానందవిహార హారమకుటచ్ఛత్రాదిసంపన్న ప
న్నగభూషాన్వితభావ భావజకళానైపుణ్య పుణ్యక్రియా
సుగమాచారగభీర భీరహితతేజోదీవ్యమానక్షమా
గగనాభోగదిశాంత శాంతమదరాగద్వేషగర్వోదయా. ౩౮

క. ఆఖ్యానకల్పితకథో
పాఖ్యానాఖ్యాయికాప్రపంచరహస్య
వ్యాఖ్యానవ్యవహరణ
ప్రఖ్యాతచరిత్ర వికచపంకజనేత్రా. ౩౯

మాలిని. శమదమగుణమోదీ శైవసిద్ధాంతవేదీ
సముచితనయబుద్ధీ సంచితైశ్వర్యసిద్ధీ
యమనియమధురీణా యజ్ఞకర్మప్రవీణా
శమితదురితవేగా సాధితాష్టాంగయోగా. ౪౦

గద్యము. ఇది శ్రీమద్వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర హరి
తసగోత్ర పవిత్ర సుకవిజనమైత్రీవిధేయ అన్నయనామధేయ
ప్రణీతం బైన షోడశకుమారచరిత్రంబునందుఁ బ్రథమా
శ్వాసము.

శ్రీరస్తు.

# దశకుమారచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీమద్విరించివితరుణే
కోమలపీతాంబరాదికరాంకమహా
స్తోమా ఘ్రామ సుకవి
స్తోమనుతౌన్నత్య యన్నసూరామాత్యా. ౧

వ. అక్షమాలాకరుండు, బుద్ధిసాహాయ్యుండును వివేకనిధియును శాంతిమంతుండును యశఃకేతుండును గరుణాకరుండును బ్రభాకరుండును జిత్రకరుండును నీతిమంతుండును నను మంత్రితనూజు లెనమండ్రును, భీమభటుండును దీర్ఘబాహుండును దృఢముష్టియు విక్రమకేసరియు నను దండనాయకతనయులు నలువురును, మతిమంతుండును గళానిధియు వసంతకుండు నను పురోహితపుత్రకులు మువ్వురును, బ్రాణమిత్రులై నిరంతరంబును బరివేష్టించి కొలువ నొక్కనాఁడు. ౨

మ. చెలులుం దానును వేడ్కమీఱ విలసచ్ఛృంగారుఁడై త
త్పురీ, లలితోద్యానములందుఁ బుష్పితలతాలాస్యంబు లీ
క్షించుచు, న్గలకంఠీభ్రమరీనినాదము లగణ్యప్రీతి సంధిల్ల లీ
లలఁ జేసెన్ జనమేజయాత్మజుఁడు కాలక్షేప మేపారఁగన్.

వ. ఇట్లు వినోదపరాయణుండై యొక్క శీతలతరుచ్ఛాయాతలంబున నెచ్చెలులుం దానును సుఖాసీనులై యున్న సమయంబున సాధకుం డొక్కరుండు నిజేచ్ఛ నరిగి వారలం గని చేరవచ్చిన నక్కుమారుండు వినతి నాతని నాదరించి మీ రెవ్వ రెచటి కేగెద రని యడిగిన. ౪

క. సాధకుఁడ నేను సుమహా
(సాధి) కు నొకసిద్ధుఁ గొలిచి యతనిపనుపునన్
సాధింపఁ గడఁగియున్నది
సాధింపఁగ నిశ్చయించి చనుచున్నాఁడన్. ౫

సీ. అది యెట్టి దనిన వింధ్యాటవిలోపలఁ
గరమొప్పు శింశుపాతరువుదండఁ
బారావతాక్షుఁ డన్నన్నగేశ్వరుపాల
వైదూర్యకాంతి యన్వాలు వహ్ని
దీధితి యనియెడు దివ్యరత్నము గల
దావాలు ధరియించి యాతఁ డేడు
దీవులు నేలు నాదివ్యరత్నముకడ
నఖిలసిద్ధులు గల వధిప నేను
వాని నిప్పుడు సాధింప వలను మెఱసి
యెంతు ననుటయు నలరి మహీశసుతుఁడు
సఖుల నీక్షించి వారలసమ్మతమున
నతనితో నిట్టు లనియె నత్యాదరమున. ౬

శా. ఏను న్మంత్రులుఁ దోడువచ్చెదము నీ కీప్రొద్దు యన్నన్ ధరి
త్రీనాథాత్మజు నిచ్చ మెచ్చుకొను చన్ దివ్యౌషధిశ్రేణితో

నానాంతరాళ వనంబు లద్భుతములం దొట్టించి యద్రిస్థలి
యూనోద్రేక ప్రౌఢి వాకః సాకః జని వింధ్యారణ్యదేశంబునన్.

తే. ఫాలనేత్రుఁ డెనకూరంబుఁ గవని
దాని చేరువ కింశుకతరువు క్రింద
నొక్క కుండంబుఁ బొడఁగని యచట నిలిచి
తనసచివులు రక్షకులుగాఁగ నియమమున. ౮

వ. నుస్థిరాసనాసీనుం డై సాధకుండు ఖదిరేంధనంబుల వేల్వం
బొడంగిన. ౯

క. కెంపుచన్నులుఁ దెలికన్నులు
నగుమోమును మెఱుఁగుమేను నయనానందం
బుగఁ బద్మనయన యొక్కతె
యగణిత విభ్రమముతోడ నరుదెంచుటయున్. ౧౦

సీ. అలినీలవేణికచాంధకారంబుచే
మదనాంధకారంబు పొదివికొనఁగ
నరుణారుణాధరయధరరాగంబుచే
భావజరాగంబు పట్టుకొనఁగఁ
జంచలనేత్రదృగ్జాలంబుచేత ద
ర్పకబాణజాలంబు పర్వికొనఁగ
నునుకుచకుచచక్రయుగముచే శంబర
రిపుజైత్రచక్రంబు ద్రిప్పికొనఁగ
నుల్లము గరంగ వైశిక పల్లటిలఁగ
ధైర్య మెడలఁగ మంత్రతంత్రములు మఱచి
తలఁపుఁ జూపును నంగనం దగిలియుండ
సంయమభ్రష్టుఁ డై యుండె సాధకుండు. ౧౧

వ. ఇట్లు సాధకుండు కామాతురుండై మంత్రసామర్థ్యంబు గోలుపోయిన. ౧౨

క. పారావతాక్షుపనుపున
ఘోరతమం బగు భూతకోటులు భయదా
కారత సాధకుఁ బొదివి మ
హారవ మెసఁగంగ నార్చి యాగ్రహమొప్పన్. ౧౩

వ. కడకాలు పట్టి దవ్వులం బడవైచిన వాని వెదక సంభ్రమించి యందఱు నన్నివంకల నమ్మహాటవి దఱియం జొచ్చి వెదకి వెదకి దిగ్భ్రమనొంది వచ్చిన జాడ యెఱుంగక యొండొరులం బొడగానక తిరుగుచుండ భూపాలనందనుండు కొన్ని దివసంబులు చెలులం దడవి యొక్కనాఁ డొక్క యేటిదరి నరుగు సమయంబున. ౧౪

ఉ. గ్రాహము తన్నుఁ బట్టినఁ గిరాతుఁ డొకండు ఘనార్తిఁ గూయుడు, న్సాహసమార నానృపతినందనుఁ డానదిఁ జొచ్చి యుద్ధతి, న్బాహుశితాసి దానివదనంబు రయంబున వ్రచ్చి బోయ న, వ్వాహిని వెల్వరించుటయు వాఁడు ముదంబెసఁగంగ నమ్రుఁడై. ౧౫

క. పూని యకారణబంధుఁడ
వై నా ప్రాణములు గాచి తనమానకృపాం
భోనిధి నను నీదాసుని
గా నేలితి, రమ్ము నాయగారమ్మునకున్. ౧౬

వ. అని తా నేలెడి కిరాతపల్లికిం దోడ్కొని చని సముచితసంభావనంబు లొనరించి నిజగృహంబులలో నొక్కరమ్యసదనంబున నునిచిన నుండి నాఁటినిశాసమయంబున రత్నదీప

ప్రభావిహీనత్వం బగు తన్నివాసంబు గలయం గనుంగొనుచు
వ్యసనుఁడై యవరోహంబున. ౧౭

చ. ఒకపరి కేళిమిమ్ముఁ గాంచి ప్రియ మొందఁగ బంధము లూడ్చి
పట్టి యుం, గేకములు మచ్చి దాసి మెడఁ గట్టినరజ్జువు గాంచి
పెద్దలకా, కేకసిసమాకృతిం బోరఁగి చయ్యన భీమభటాభి
మానుఁడై, ప్రకటవిశేషతి ప్రమొక్కుటయు దానుతోఁ దమ్ముత
మోదమగ్నుఁడై. ౧౮

వ. అత్యంతసంభ్రమంబునం బరిరంభణం బొనరించి యతనిపు
నఃపునఃప్రణామంబు లాదరించి సమీపంబున నునిచికొని
తత్కరంబు కరంబునం గీలించి నీ కీరూపంబునకుం గారణం బేమి
యని యడిగినఁ గరంబు వినయంబున నత్తం డ్రతని కి
ట్లనియె. ౧౯

క. ఆపన్నగంబు కతమున
నాపన్నత మిమ్ముఁ బాసి యలజడి నశేనా
యాపీడనొంది యుజ్జయి
నిపురముం జేరి మేను నెఱిచెడి తూలన్. ౨౦

సీ. ఏ నొకముదుసలియింటికి నరిగి నా
కాహార మొనరింపు మనుచుఁ బ్రీతి
వెలయించి భోజనవేళయం దాఁకను
నది నన్ను శయనింపు మనిన శయ్య
నుండి చూచుచు నుండ నొకకొన్నియవ లది
ధరణిమీఁదటఁ జల్లెఁ దత్క్షణంబ
మొలచి గుబ్బన నేచి ఫలియింప సక్తువు
గావించి యదియుఁ బాకంబుచేసి

నొక్కపాత్రంబులోపల నునిచి ప్రాంత
యవలఁ బాకంబుగావించి యడియునొక్క
కంచమునఁ బెట్టి యొకచీర గప్పి దొంతి
నునిచి యది పెరుదేరంగఁ జనియె నంత. ౨౧

వ. అది కపటకృత్యంబుగా నెఱింగి. ౨౨

గీ. పాత్రములు సక్తువులు వేఁడుపడఁగఁ బెట్టి
యంబరం బది కప్పినయట్లు కప్పి
యేను శయనతలంబున మేను సేర్చి
కన్ను మూసినపోలిక నున్నయంత. ౨౩

వ. ఆజంత యరుగుదెంచి నేఁ జేసినవిధం బెఱుంగక యత్యంత రయంబున. ౨౪

క. నాపేర నిర్ణయించిన
యాపాత్రము నాకుఁ బెట్టి యవ్వలిపాత్రన్
వేపుచ్చుకొని భుజించుచు
నాపాపపుజంత మేఁక యయ్యె నరుదుగన్. ౨౫

వ. దానిం గనుంగొని నివ్వెఱం గందుచు నాకుం బన్నినయురుల నీవ తగిలితే యనుచు నవ్వుచు భుక్తోత్తరంబున నొక్కరజ్జువున దానికంఠంబు ఱంధించి తిగిచికొనుచు నొక్కసూనరి గృహంబునకుం జని జట్టి యిచ్చెద ననిన నతనిభార్య యెఱింగి నాచెలియలి నిట్లు చేసితే కాని మ్మని జంకించిన వెఱచి యయ్యజంబు విడిచిపెట్టి దేవాలయంబునకుం జని నిద్రించితి నదియు నదియ వైరంబుగాఁ బాటించి నాచొప్పునం జనుదెంచి యేను మయూరం బగునట్లుగా సూత్రాడు మత్కంధరాంతరంబున బంధింపంబోలు నేనును బర్హిభావంబు

నొంచి బోయులచేతఁ బట్టువడి యిప్పాటికి వచ్చి దేవరచే
తని తిర్యగ్జాతివిముక్తుండనై భవదీయదర్శనంబునఁ గృతా
ర్థుండనైతి నని పలికి యొక్క విన్నపం బవధరింపు మని యి
ట్లనియె. ౨౬

సీ. తోంట యిప్పుడు వెడలంగ వలయుఁ గి
రాతు లుద్ధతులు ద్వారమున వెడలి
పోవంగఁ గనుఁగొన్నఁ బాలియింతురు కిత్రాటి
వలన మయూరభావములు దాల్చి
యీనగాశ్రమ్మునఁ నేఁగుద మని నృప
తనయుకంఠమున నాత్రాడు గట్టి
నెమలి యై యప్పుడు నాకొమరుండు వెడలి త్రా
డూడ్చి యాతనిచేతి కొసంగుటయును
నాగుణము కంఠమునఁ గట్టి నాక్షణంబ
తాను బక్షి యై వెడలి రాసూనుచేత
బంధనిర్ముక్తుండై యాత్మభావ మొంది
కమరయంబున నాపల్లె వెడలి వచ్చి. ౨౭

వ. తనమతమున కుల్లసిల్లుమహీనాథకుమారుండును దానును
గాననమార్గంబున నరిగి యరిగి. ౨౮

చ. పశ మగుచీఁకటిం దెరువు దప్పి పదంబులు నొప్పిగూరినన్
సొలసి వనంబులోన నొకశుష్కమహీజముక్రింద నుండఁగా
లలితనిశాకిరాతమహిళాకచభారవిభాసితాబ్జినీ
దళమును బోలి తూర్పుదెసఁ దారకరా జుదయించె నత్తఱిన్.

చ. నెలవొనమవంగఁ జిత్రముగ నీరసభూరుహ మాకు వెట్టి మొ
గ్గల విరిపూవులం దనరి కాచి ఫలించినఁ దత్ఫలావళుల్

దళముగ వారు మోదమునఁ దద్రస మానుచుఁ గ్రోలి దాన
నాఁ, కలియును దప్పియుం బోలఁగఁగా ముద మందుచు
నున్నయంతటన్. 30

సీ. ఆకుజము గుణాకరాఖ్యమిత్రుం డగు
టయును నమ్మతంబుఁ బ్రియముఁ దనర
నక్షితోడ నప్పు డాలింగనము చేసి
యిట్టు లగుటకుఁ గత మేమి యనిన. 31

సీ. ఆహాముకినుకచే నందఱఁ బెడఁబాసి
యడవులలో మిమ్ముఁ దడవి తడవి
యిచ్చోట నొక్కమునీశ్వరుండు సమాధి
నుండు టెఱుంగక యురక నేను
బ్రణమిల్లి చెలులను రానుతుండు నెచట
నెబ్బంగి నున్నవా రెఱుఁగఁ జెప్పు
మనుచుఁ గార్యార్థినై యందంద ప్రార్థింప
జపవిఘ్నమునకు నాతపసి కినిసి
వట్టితరువవు గమ్మన్న వంత నొంది
వేఁడుటయు నాదరించి నీవిభుఁడుఁ జెలియు
నిచ్చటికి రాఁగలరు వార లేగుదేర
నెలమిఁ బొంది ఫలింతు వా రెలమి నొంద. 32

క. దళముగ ఫలింప నీఫల
ములరసముల వారు తృప్తిఁ బొందుదు నంతన్
ఫలవృక్షాకృతి విడుచుచుఁ
జెలువంబుగ వారిఁ గదిసి చెలఁగెద ననినన్. 33

శా. ఈపాత్రంబు నిరంతరేష్టఫలదం, బీయష్టి ప్రాయంగ నే
రూపంబైనను నిక్కువంబ యగుఁ, జేరం గోరుచో టన్న
రం, డీపాగ ల్దొడిగినట్లు, మత్పైతృకసం బీవస్తువు లీ్వనికై
కోపం బారఁగఁ బోరఁగావలసె మాకుం బాలుపోకుండుటన్.

క. అనుటయు నతిమత్సరతం
బెనఁగెడు వారలను గాడుపెట్టి పఱచి కై
కొనియెద నీవస్తువు లని
మనమున నూహించి చతుర(మత) మేపారన్. ౪౦

క. ఇరువురు సంగడి విడువక
పరువునఁ జనుచోటఁ గడవఁ బాఱెడువాఁ డీ
వరవస్తువులకు నొడయఁడు
పరభవగతి నరుగుఁ డనిన సమ్మదమొదవన్. ౪౧

క. ఏ విడువఁగ సమసత్త్వులు
గావున నొండొరులఁ గడవఁగాఁ జాలక యా
దేవారులు ద వ్వరిగిన
నావలఁ బాఱె రని నెమ్మనమున నలరుచున్. ౪౧

క. త్వరతో యష్టియుఁ బాత్రయుఁ
గరమునఁ గబళించి పాదుకలుదొడిగి యేనం
బరగతి...నా యంజక
పురమున కరిగితిఁ గుమారపుంగవ వినుమా. ౪౩

క. అందొక్కవృద్ధకామిని
మందిరమున విడిసి తదభిమతధనములు పెం
పొందఁగ నిచ్చియు నప్పురి
యందొప్పెడుకాంత గలదె యనియడుగుటయున్. ౪౪

ఉ. రత్నరథుండు నాకసురరత్నము మాప్రియరాజు తత్పుత్రా
రత్నవతీసమాఖ్య పరిరత్నవిశాలకఁ బోలుకన్యకా
రత్నము లేదు లోకమున రాజతిరేలల నెన్నుచుండు నా
రత్నగృహంబునం దనుదు రాసుత యుండెడు మేడఁజూపినన్

వ. నాఁటినిశాసమయంబున మదీయవామకామపాను భావంబునఁ
మదీయశాపంబునకుం జని రత్నకేళీకాలోకం బగు తదంత
రంబున. ౪౬

క. తొంగలిఱెప్పల మెఱుఁగులు
తొంగలిగొనుమోము వదనతోయరుహంబుఁ
రంగారఁ దల్పమున న
య్యంగన నిద్రింపఁజూచి యాత్మగతమునన్. ౪౭

క. నాగతి మున్ను నెఱుంగదు
నేగతి మేల్కనువాఁడ నీసతి నిద్రా
రాగము లగుచూపుల నను
రాగము వోడమునో యమ్మరాగ మొదవునో. ౪౮

ఉ. అగ్గల మైనమోహమున నల్లన నేనొకయింత డాసినన్
దిగ్గన మేలుకాంచి సుదతీమణి వింతదనంబులేక తా
నిగ్గులుమీఱు కిన్నెఁగవ నెయ్యపుఁ జూపులు సందడింపఁగా
డగ్గఱునేని నాకు నిట దక్కు మనోభవరాజ్యసంపదల్. ౪౯

క. అనుచుండ సౌధపాలుఁడు
తన ప్రియ కొకకథను జెప్పి తద్వేళకు నా
కనుకూలంబై కడునిం
పెనయంగా నొక్క పద్య మి ట్లని చదివెన్. ౫౦

ఉ. లాలితరూపయౌవనవిలాసమనోహరయై తనర్చు నె
లాలక నిద్రవోవఁ గని యాదటఁ గౌఁగిట మేలుకన్నఁగాఁ
జాలక యాత్మఁ దక్కిన విచారములొందఁగ నూరకుండ నా
కూళఁడు కామరాజ్యమునకు న్వలిగాఁడె తలంచిచూడఁగన్

క. అనపలు కుపదేశముక్రియ
ఘనమోదము నిగుడఁజేయఁ గదిసెంతమకం
బునఁ గౌఁగిలించి యమ్మా
నిని మెలుపారంగ నేను నిద్ర దెలిపినన్. ౫౨

క. చంచలనేత్రము లమరఁగ
సంచలతయు సమ్మదంబు సంశయము మది
న్ముంచిన హస్తస్వస్తిక
కంచుక యగునింతియొప్పు గనుపలరింపన్. ౫౩

ఉ. ఇచ్చ జనించువేళ నొకయించుక వింతదనంబు సేయమిన్
మచ్చిక లేక యుండియును మచ్చిక లగ్గల మైనపోలికిం
బొచ్చెము లేనిసౌఖ్యములఁ బొందితి మేము రహస్యవేళలం
బచ్చనివింటిదేవరప్రభావము భావములం గరంపదే! ౫౪

వ. ఇట్లయ్యింతియు నేనును నత్యంతమోదంబునం గంతునిం గృ
తార్థునిఁ గావించి తదనంతరంబ. ౫౫

క. నావృత్తాంతముఁ బేరును
నావెలఁదికిఁ జెప్పి రాత్రి యంగనతోడన్
భావజకేళిం దేలుచు
నావిడిదల దివసవర్తనంబు గడుపుచున్. ౫౬

ఉ. ఇప్పగిది న్రహస్యముగ నే నొనరింపఁగ బోటు లొక్కనాఁ
డప్పువుఁబోఁడిచన్నుఁగవ నంగజముద్రలు గాంచి రాజుతోఁ

చెప్పకయున్నఁ దప్పునపు శీఘ్రముగాఁ జని యేకతంబునం
జెప్పినఁ బాఱెఁ గాకునని చిత్తములోపల వంత మీఱఁగన్.

వ. అనుచుఁ దన పేరంబు విదితంబుగ నారయఁ బ్రోడ నొత్తుఁ బం
పిన యది యేఁగుదెంచి యొకచెంగట నుండి రతాంతవేళ మా
మిరియును నేను నైమఱచి నిద్దుర వోవఁగఁ జూచి ప్రోడలీ
ల నెవరు నామచేలమున లక్షిక రేఖలు వ్రాసె నచ్చుగన్.

క. అంబుజముఖి యిటు లడుగా
శంబులు గావించి చెప్ప లాక్షాంకసమే
తాంబరుఁ బురిఁ దడవుందు క
యంబున నని రాజు భటచయంబుం బనిచెన్. ౫౯

వ. అవ్వృత్తాంతం బంతయు రాజసదనాంతర్వర్తిని యగు నావృ
ద్ధజంతచేత విని యచ్చట నునికి యకార్యం బని నిశ్చ
యించి పాదుకాసమన్వితపాదుండై పాత్రయు లాతంబు
నుం గొని యాక్షణంబ కమలాక్షి యున్న సౌధంబునకుం
జని సకలంబు నెఱింగించి గమనోన్ముఖుండ నగుటయు ని
న్నుం బాసి నిమేషం బైనను బ్రాణంబులు నిర్వహింపనేర
నితోడన వచ్చెదఁ దోడుకొనిపొమ్మనిన నిమ్మగువం గరం
బులం బొదివికొని గగనగమనంబున వచ్చి వచ్చి యిచ్చట
దేవరం గాంచి యానందకందళితభావుండ నగుచు నవతరిం
చితి ననుచు విన్నవించి. ౬౦

గీ. భక్ష్యభోజ్యలేహ్యపానీయచోష్యముల్
సంకుమదపటీరచంద్రమ్ముగమ
దములు పాత్రమహిమఁ దత్క్షణమాత్రన
వడసి నెచ్చెలులకుఁ బతికినొసఁగి. ౬౧

వ. మఱియు నక్కుమారు నాలోకించి. ౬౨

క. నాయష్టిమహత్త్వంబున
నీయెడ దేవరకు నుండ నిరవుగ సకల
శ్రీయుత మైతగుపట్టణ
మాయతముగ వ్రాయువాఁడ నని యుత్సుకుఁ డై. ౬౩

సీ. మణిహేమవిస్తారమందిరప్రాకార
సౌధదేవాలయసంచయములు
ఘనసత్త్వబంధురగంధర్వసింధుర
దుర్గమసుభటసందోహాళములు
వరధరణీదేవ వైశ్యశూద్రాదినా
నాజాతు లైనజనావళులును
నిరుపమలావణ్యసుచిరగుణాగణ్య
పణ్యపుణ్యాంగనాప్రకరములును
సన్నుతగృహోపవనములు సత్వనిధులు
నెఱయ వ్రాసిన నన్నియు నిక్కువంబు
లై త్రిలోకీపురీరాజ్య మనఁగఁదగిన
పట్టణము వోల్పెఁ గన్నులపండు వగుచు. ౬౪

వ. ఇట్లు చిత్రంబుగాఁ జిత్రకరుండు పురంబు నిర్మించి దానికిం జిత్రపురం బని పేరిడి యందు రాజమందిరంబునఁ గమలాకరకుమారుని సింహాసనాసీనుం గావించి తానును భీమభటుండును గరుణాకరుండును, సముచితప్రకారంబులం గొలుచుచు మణికనకభాసురనివాసంబుల విశిష్టవిభవంబుల నుల్లసిల్లుచున్నంత. ౬౫

గలనూపురకాంచీమం
జులరావము లెసఁగ నింతి చూడ్కికి నబ్బెన్. ౭౨

క. హారావళిలో నయ్యం
భోరుహలోచనకుచాగ్రములు గనుపట్టెన్
శారదనదిఁ గానంబడు
హారిసరోజాతకుట్మలాగ్రములగతిన్. ౭౩

ఉ. అవ్వనజాక్షిఁ జూచి హృదయంబున రాగము నివ్వటిల్లఁగా
నివ్వెఱఁగంది చెప్ప లిడనేరక చూడఁగ ధైర్యమూలముల్
ద్రవ్వెడుచూపుల న్వికచతామరసానన చూచె నామదిం
బువ్విలుకాఁడు దట్టముగఁ బుష్పశరంబులఁ దూఱనేయఁగన్.

క. పులకలుఁ జెమరును గంపము
నెలకొన నొకమాటుసందు నిలిచితి నేను
జ్వలితపుష్పబాణబాణా
కలిత యగుచు నెట్టకేనిఁ గోమలి చనియెన్. ౭౫

వ. ఏనును మీనకేతనోదారశరాసారవిదారితమానసుండ నగు
చు విజయసేనుం గొలువ నరిగి యవసరం బగునంతకు నగ
రిలో నొక్కెడ వసియించి మదిరావతినిం జింతింపుచున్నంత
నన్నాతి యుపమాత గనుంగొని కన్నునన్న నన్నుం జేరి
ధవళాంబరంబునం బొదివినకందుకంబుచందంబున నున్నపూ
దండ నాకుం జూపి యిట్లనియె. ౭౬

క. ఏమితపం బొనరించితొ
మామదిరావతి ప్రియంబు మదిఁ గదురంగాఁ
దా ముదముతోడఁ గట్టిన
యీమాలిక నన్ను నీకు నిమ్మనిపనిచెన్. ౭౭

ప్రేమ దలిర్ప నొద్దను వరింపఁగ నామది కియ్యకోలు గా
దామనుజేంద్రుఁ డేల నను నన్యుల కిచ్చు ననాదరంబునన్.

గీ. అనెడుపలుకు సుధాసేక మగుచుఁ జెవుల
నలరఁజేసె డెందంబు గొందలము మాన్పెఁ
జలనమొందిన ప్రాణంబు నెలవుకొలిపె
నూతనాంగజరాగంబు నూలుకొలిపె. ౮౫

వ. అమ్మగువమాటలు విని నమ్మి యిమ్మెయి నూఱడిల్లి యున్నంతఁ గొన్నిదినంబులకు లగ్నదివసంబు వచ్చుటయు.

సీ. రాజనిశ్చితుఁ డైన రాజకుమారకుం
డభినవవిభవంబు లతిశయిల్ల
నసమానమణితోరణాలంకృతం బైన
రాజమార్గంబున రమణతోడ
నానావిధవిభూషితానేకజనములు
చెలువారఁ దనచుట్టు బలసికొలువఁ
గనకహర్మ్యము లెక్కి కామినీజనములు
తనమీఁద శేషాక్షతములు చల్ల
వివిధశోభనవాద్యము ల్విస్తరిల్ల
నతులవందిమాగధజనస్తుతులు చెలఁగఁ
బ్రీతి మదిరావతీకన్యఁ బెండ్లియాడ
వైభవోన్నతు లలరార వచ్చుటయును. ౮౬

క. ఏ నావిభవము గనుఁగొని
మానసమునఁ జాలఁ గుంది మదిరావతిపై
నూనిన యాస విడిచి యతి
దీనతఁ బురి వెడలి పోయి ధృతి మాలివెసన్. ౮౭

క. కాయజకేళిని కోర్కెన్
కాయము విరహంబు గుందఁగా నై వగతోఁ
నాయకుఁ బొడఁగని బుద్ధిన
హేయముగ నచ్చటియుఁ గాంచి హర్షం బెసఁగన్. ౮౯

వ. గాఢానురాగం బొనరించిన వృత్తాంతం బంతయు నెఱింగించి నం దంతికంపవలదు విహ్వలయువల్లభ వేఁక సిద్ధించునుపాయం బు గల్గెడు నని యూహించి వెడలినయట్లు యేనునుం బడితి నాకథ వినుమని యిట్లనియె. ౯౦

సీ. అట్లు వింధ్యాద్రి మీఁదఁ బోసి యరిగి యేను
బెక్కుగహనంబులు గడచి యొక్కయడవి
నిందిరామందిరం బయి యందమందు
శంఖపాలాఖ్య నొప్పారు సరసిపొంత. ౯౧

క. పలువురుబోటులతోడను
జలకేళి యొనర్ప వేడ్కఁ జనుదెంచిన యు
జ్జ్వలరూపవైభవవతిని
విలసితరూపవతి నొక్కవెలఁదిం గంటిన్. ౯౨

క. అంగనకబరీమేఘము
నంగతటిద్ద్యుతియుఁ జూచి యనురాగముతో
నంగజుకేళిమయూరము
భంగిని సమ్మదవిఘూర్ణభావుఁడ నైతిన్. ౯౩

క. ఆకాంతయు నన్నచట వి
లోకనములఁ జూచుచుండె లోలాత్మిక యై
యాకోలనివంక నొక్కమ
హాకరి యచ్చటికి వచ్చె నంభోవాంఛన్. ౯౪

మ. గళదానద్యుమ్నసరంజితభ్రమరరేఖం గాలకూటచ్ఛవిః
కలితోద్యంచితమందరంబువిధమై కర్ణానిలాలోలదీ
ర్ఘలసన్నిర్మలచామరంబుల బలాకావేష్టితాబ్దంబునా
నలి గర్జిల్లెడు నాగజంబుఁ గని కాంత ల్భ్రాంతలం బందఁగన్.

వ. ఒడ కోడకు మని యమ్మానినిం జేర నరుగుటయు. ౯౭

క. అతిభీతిరాగయోగో
ద్ధతకంపస్వేదపులకితప్రసభసము
న్నతకుచము లురము గాడఁగఁ
నతివ ననుం గౌఁగిలించె నతిరభసమునన్. ౯౮

చ. కనుకలిఁ జిక్కి యేను బిగికౌఁగిటఁ జేర్పఁగఁ గోరునాసరో
జనయన యప్డు కుంజరమిషంబునఁ బైఁబడి యిట్లు కౌఁగిలిం
చినఁ బులకించి యిట్టి దని చెప్పఁగరాని సుఖంబుఁ జెప్పిన
న్నను నెఱుఁగంగనేరక మనంబున నేన కరంగుచుండితిన్.

వ. ఇవ్విధంబున నభినవసౌఖ్యంబు లనుభవించి యే నయ్యేనుం
గు నుద్దేశించి. ౯౯

ఉ. ఓకరిరాజ నీకతన నుత్పలలోచన దాన వచ్చి న
న్నేకొని కౌఁగిలించె వికసిల్లుచు నిట్టిపరోపకారికి
న్నికఁ బ్రియాసమాగమము నిచ్చలుఁ గావుతఁ దత్కరో
ల్లస, చ్ఛీకరశీకరప్రకరసేకసుఖంబులు నివ్వటిల్లఁగన్. ౧౦౦

వ. అని దీవించితిం దదనంతరంబ యాసామజంబు నపారాశుసీ
త్కారపూరితశీకరాసారమండితం బైన కరదండం బార్పు
చు నామీఁదన కవిసిన నయ్యింతి నోసరిలం జేసి. ౧౦౧

క. కరికరము పట్టికొని

... ... ...

నెరవృమెయి దాఁటి యరిగితి
మరలి కనుఁగొనకయున్న మహితరయమునన్. ౧౦౨

క. ఏను గని కన్నవదనా
లోనన రెప్పలు వమ్మలోచనఁ గొనుచుం
గానకము దరిసి రెవ...

... ... ... ౧౦౩

వ. .........రంబు బ్రవేశించి యున్నంతఁ దంతావళంబు సరః ప్రాంతంబున నెంతయుఁ బడవు విహరించి యది తొలంగి చనుట యెఱింగి యయ్యెడ వెడలి యయ్యెలనాఁగ చనిన వలని......బున. ౧౦౪

ఉ. వనజాక్షి నీవలన నారసి కానక యాతురుండ నై
భావజవహ్నిఁ గ్రమ్మికొని భానము గాల్పఁ జరించునంత రా
జీవవిరోధిమండలము చిచ్చుఱపిడ్డను బోలె నెన్నఁ
... ... ... ... చున్. ౧౦౫

వ. అప్పుడు దేహారు మదనానలతాపంబున కోర్వక మరణోద్యుక్తుండ నై యాంగికంబు లగుశుభసూచకంబులు గల్గిన నం గనం గనుఁగొనియెద నను......డ నై పెక్కెడలం జరించి యిక్కడకు నరుదెంచి నిన్నుఁ గాంచితి నని తనవృత్తాంతంబుఁ జెప్పిన యనంతరంబ మనోభవాధీనమానసుండ నై న న్నూఱడించి యి ట్లనియె. ౧౦౬

క. ... ... ...
... ... ... మునిగుడికిం
జని లో నొక్కెడ నుండఁగ
మనకోర్కె ఫలించు నిచట మసలఁగ నేలా. ౧౦౭

క. అని పలికి నన్నుఁ దోడ్కొని
చనఁగా నిపువురముః బుష్పసాయకునకుఁ జీకిం
జని గర్భగృహంబున న
మ్మనన... ... ... ౧౦౮

వ. ... ... యంబునం గరదీపికాసముదయంబు వె
లుంగ నాందోళికారూఢ నై యమందవిభవంబున. ౧౦౯

క. ఘనవాద్యఘోషభీషణ
జనవననిధినడుమ లక్ష్మిసరణి నమరుచుం
జను ... ...
... ... ... నంగజునకుడికిన్. ౧౧౦

గీ. వచ్చి చెలువందఁగా నెల్లవారి నిలిపి
యొక్కతియ గుడి సొచ్చి చిత్తోద్భవునకు
మ్రొక్కి కరకమలంబులు మోడ్చి నిలిచి
కన్నుసీరొల్క నిట్లని విన్నవించె. ౧౧౧

క. అగణితవిలాసు నొక్కని
... ... ... ...
... కవేఱ యొక్కని
మగఁడని తగిలింపఁ దగునె మనసిజ నీకున్. ౧౧౨

క. ప్రాణేశవిరహమోర్వం
బ్రాణము విడిచెదను మీఁదిభవమున నైనం
బ్రాణేశ్వరుఁ గందు రతి
ప్రాణే... ... ... ౧౧౩

వ. నిర్భరతరం బగుసాహసంబున గర్భగృహంబు సొచ్చి కంఠం
బున నురి యిడుకొనుటయు. ౧౧౪

క. బాలిక యొక్కతె యెత్తిక
నాలింగనపులకసహిత మగుకేల మొకం
గీలుకొలిన యుచి వృద్ధిన
నాలోకించి నయనెఱిఁగి యానసమయమునన్. ౧౧౫

క. అనురాగకంపలజ్జల
నూనినమదిఁ దోఁడ వెచ్చనూర్పుచు నయ
జ్ఞానన సబాష్పగద్గద
యై నన్నుం గౌఁగిలించె నత్యనురక్తిన్. ౧౧౬

వ. అప్పు డ్రియాలింగనసౌఖ్యతరంగితాంతరంగుండ నై యాకు
రంగలోచనం గనుంగొని. ౧౧౭

క. వనజాతనేత్ర యడలకు
నిను వెరవునఁ గొనుచుఁ బోదు నిమిషములోనన్
మనవాలి పుణ్యదేవత
మనసిజుఁ డిచ్చోటఁ గూర్చె మనలం గరుణన్. ౧౧౮

వ. అని యూఱడించుసమయంబున బుద్ధిసహాయుండు నన్నుం
గనుంగొని యిట్లనియె. ౧౧౯

చ. వెలఁదుకభూషణంబులును వేషము నచ్చుపడంగఁదాల్చి యే
వెలువడి పెండ్లికన్యయున వేడుక నందల మెక్కి యేగెదం
గలజను లెల్లఁ బాయ నెసఁగామిని దోడ్కొనిపోయి యంబికా
నిలయములోన నుండు మని నేర్పున ధైర్యము విస్తరిల్లఁగన్.

చ. కచభర మూడ్చి నుంపురుముగా నిడి మించినపూవుగుత్తు
లం, గుచములు గాఁగఁ గట్టుకొని కోమలి భూషణవస్త్ర
మాలికా, ప్రచయము దాల్చి మీసములు రాని మొగం

బునఁ గాంతిమెఱుఁగా, నచలగతి నృపుంగిడి లతాంగిగతి
న్వోలి కల్ల నోనన్. ౧౨౨

వ. పరిజనంబులు సంభ్రమంబున నిద్రయు నెఱుంగక యాందోళిక యెక్కించుకొని క్రందుకొనం గొలిచి యందఱు నరిగిన.

క. మదిరావతిఁ దోడ్కొనిచని
మదిరాగం బెసఁగ దుర్గమందిరమున నె
మ్మది రాగిల్లుచు నుండఁగ
నది రాజ్యముకంటె నాకు హర్షముచేసెన్. ౧౨౩

వ. అట్లుండునంత బుద్ధిసాహాయ్యుండు మూఁడవజామునఁ బ్రియకామినీసహితుండై యచ్చోటికి వచ్చిన నచ్చెరు వంది పిచ్చలించుచున్న యంతరంగంబు లలర గాఢాలింగనం బాచరించి యిచ్చోటున నెచ్చట నీకుం జేకుఱె ననిన హాసభాసితవదనుం డగుచు ని ట్లనియె. ౧౨౪

ఉ. ఏ వనితాకృతి న్నగరికేగి నృపాత్మజయుండునట్టి య
మ్మోవరికేగి తల్పమున నొప్ప ముసుంగిడి యున్నయంత
న, న్నాభవరకన్యగాఁ దలఁచి పొల్తుకయొక్కతె చేరవచ్చి
తా, నావనజాక్షి చిత్తగతి యంతయు మున్నె యెఱుంగుఁ
గావునన్. ౧౨౫

వ. ఎవ్వరు వినకుండ నల్లన ని ట్లనియె. ౧౨౬

ఉ. వందఁగనేల యిట్లు వలవంత దొఱంగుము రాజకన్యకుం
బొందఁగవచ్చునమ్మ తనబుద్ధికి వచ్చినవానిఁ దండ్రి యా
త్మం దలపోసి యిచ్చినయతండు వరుండని యుండు నెమ్మితో
నందనిమ్రానిపండులకు నఱ్ఱులు సాఁపరు పద్మలోచనల్.

క. ఈవేళఁ బాము పైంచితి
యీవిధమున నుండు టుచితమే తలపోయన్
భావజనిహ్నయుఁడంగజు
భావంబున ధైర్య మింత పట్టుకొలుపునా. ౧౨౮

క. మానసభవుశిఖి వేఁడిమి
యే నెఱుఁగనె దీని నడఁగ నేఁటికి విరహా
గ్నానిం గుందుచు మానిని
గానేరక యున్నదానఁ గమలదళాక్షీ. ౧౨౯

సీ. తంత్రిపాలాక్ష్య కొప్పారుసరసి పొంత
మన్మథాకారు నొక్క (కుమారు)ఁ జూచి
యుల్ల మలరంగఁ జేరుచో నొకగజంబు
విధివశంబున మముఁ బాపె వీఁకఁగదిసి. ౧౩౦

క. కరి ప్రాణేశ్వరుఁ బాపిన
విరహమునకు నోర్వలేక వేఁదురునై యా
మరుఁడు దగిల్చిన చిచ్చున
నురిసెద నదిమొదలుగాఁగ నుత్పలనయనా. ౧౩౧

క. నావుడు మత్ప్రియఁ గా మది
భావించి మునుంగు వచ్చి భావం బలరన్
నీవల్లభుఁడను నే నని
నావృత్తాంతంబుఁ జెప్పినం దెలిసి వెసన్. ౧౩౨

క. అంగము తాపము వాయఁగ
నంగన ననుఁ గౌఁగిలించి యాత్మగరంగం
బొంగెడునాదెసఁ గనుఁగొని
యంగన యిట్లనుచుఁ బలికె నతిమృదుభణితిన్. ౧౩౩

క. ఈమదిరావతితల్లియు
నామాతయుఁ దోడఁబుట్టినా రట్లగుటన్
భూమీశునాజ్ఞఁ జెంజికి
నే ముదమున వచ్చి కంటి నిచ్చట నిన్నున్. ౧౩౪

వ. అని చెప్పిన నత్యంతసంతుష్టాంతరంగుండ నై మదిరావతీ
కల్యాణనిమిత్త మదిరాపానమత్త పరిజనప్రతీహారద్వారపా
లాదుల వంచించి వచ్చితి నని చెప్పిన నుప్పొంగుచు నిప్రాద్ర
కదలి యిద్దఱము నన్నార్థుల(?)మై యింతులం దడవికొని
కాంతారమార్గంబున నరుగుదెంచి యిచ్చట దేవరం గాంచి
కృతార్థుల మైతి మని చెప్పిన నద్భుతరసాయత్తచిత్తుం
డయ్యెఁ దదనంతరంబ. ౧౩౫

క. ఆనరనాయకుఁ డత్తఱి
నేనిక వేఁటాడ దూర మేగి యొకమహా
కాననములోన దుర్గా
స్థానముఁ గని యచటఁ జేరఁ జనియెడునంతన్. ౧౩౬

## వసంతకునికథ

క. పరమేశ్వరి కతిభక్తిని
నరబలి యొనరింప వచ్చినకిరాతులు ద
న్నరపాలునిఁ గని పట్టిన
నరుల విడిచి భీతిఁ గాననముఁ దూఱుటయున్. ౧౩౭

క. బుద్ధ్యధికుండు వసంతకు
వధ్యశిలాగ్రమునఁ గాంచి వసుధాధీశుం
డధ్యానందుం డగుచున్
విధ్యనుకూలతకు నాత్మ వికసిల్లంగన్. ౧౩౮

క. తనమంత్రులుఁ జూడఁగ నా
హానములు వేడ్క చేఁ దరిగి యతని బం
ధనము విడిపించి యాలిం
గనముల గావించి యుప్రము ఘనమోదమునన్. ౧౩౯
వ. అతండును దానును సముచితాసనంబు లిచ్చి దేవికి సా
ష్టాంగదండప్రణామంబు లాచరించి శీతలతరుచ్ఛాయ నాసీ
నులై యుల్లాసంబున నతండ దరుగఁ దమవృత్తాంతం బెఱిఁ
గింపఁ దదనంతరంబ వసంతకుండు కరయుగంబు మోడ్చి
మహీకాంతున కిట్లనియె. ౧౪౦

నాపితకథ

క. భూరమణ నిన్ను వెదకుచు
ఘోరాటవిలోనఁ దిరుగఁ గొందఱుచోరుల్
క్రూరత మీఱఁగ నొకచే
పారిధనంబు హరియింప నతఁ డాతురుఁడై. ౧౪౧
క. మొఱ వెట్టఁగ నావైశ్యుని
వెఱ వంతయుఁ బాపి చోరవీరులనెల్ల
న్నుఱుమాడి యాతఁ డెంతయు
వెఱఁ గందఁగ సొమ్ము లెల్ల వెస నొసఁగుటయున్. ౧౪౨
వ. అత్యంతసంతోషంబున నతండు వినతుండై నన్ను బహు
విధంబులం గొనియాడి మదనోల్లాసం బనుతనపురంబునకుఁ
దోకొనిపోయి యపారధనంబు లిచ్చి సంభావించె నప్పురం
బు బహువిధవినోదాస్పదంబు. ౧౪౩
సీ. శుకుఁడైన నవ్వీటిజోటులఁ జూచిన
భంగంబు నొందు దర్పకునిచేత

శివుఁ డైన నప్సరశ్చెలువలఁ జూచిన
మరు లొందు భావసంభవునిచేత
శరజన్ముఁ డైన నప్సరఃకామినులఁ గన్న
రాగాంధుఁ డగు రతిరాజుచేత
వరదుఁ డైనను నన్నగరకాంతలను గన్న
మదనాతురుం డగు మదనుచేత
బ్రహ్మచర్యంబులకు నెల్లఁ బాయుదెరువు
వివిధనియమంబులకు నెల్ల విడుకోలు
మహితభోగంబులకు నది మందిరంబు
ల..............స్మరోల్లాసపురము. ౧౮౮

సీ. హాటకహర్మ్యంబు లంగకేఁకులవాడు*
పరిచారికావళి భటచయంబు
స్మరబంధచిత్రము ల్పకినలమంచము
ల్పరుపు గిరంబులుఁ బౌరువంబు
లాలవట్టంబులుఁ గీలుబొమ్మలు మంచి
పైఁడిపన్నీరులుఁ బట్టుతెరలు
నిలువుటద్దములు గంటలయుయ్యాలలు హంస
తూలికపాన్పులు దోమతెరలు
సారమృగమదకర్పూరచాదనములు
లలితచీనాంబరాదులు పొలుపు మిగిలి
చెలువు మీఱ మనోహరశ్రీల మెఱసి
యొప్పుదురు వారకామిను లప్పురమున. ౧౮౯

* యీపద్యము మూఁడవయాశ్వాసములో నున్నదని - శబ్దరత్నాకరము.

పాపాత్మక యది నాశ్రా
ణాపాయ మొనర్పఁ దలఁచి యతిదాష్ట్యమునన్. ౧౫౧

క. రూపిణికి నాకుఁ జొక్కడి
యాపొలఁతుకఁ బాపి యిద్ద ఱతివలచేతన్
మోపించుకొనుచుఁ గొని చని
వే పాఱెడు నీటిలోన విడిచి యరిగినన్. ౧౫౨

క. మోచుకొని యరుగునప్పుడు
చూచుచునుండియును నేను జొక్కుకతమునన్
లేచి చనలేక నదిలో
వైచిన నొక కొంతతడవు వఱద నరుగఁగన్. ౧౫౩

క. అంగంబు నీటిలోన ము
నింగినఁ జొక్కుడలుటయును నెఱిఁబడి యేనుఁ
డంగ వఱదబడి యొకమా
తంగముడొక్క ననుఁ జేరె దైవవశమునన్. ౧౫౪

క. ఆయేనుఁగుడొక్కను బా
హాయుగమునఁ బట్టి యెక్కి యగ్రమునందే
నాయతరంధ్రముగాంచి యు
పాయంబున లోనఁజొచ్చి యచలాంగుఁడనై. ౧౫౫

వ. కొంతతడవునకు సేదదేఱి యున్నంత నాదంతికళేబరంబు నదీ
వేగంబున నంబునిధానంబు సొచ్చిన. ౧౫౬

ఉ. ఒక్కమహాఖగం బెచటనుండియొ యచ్చటి కేగుదెంచి యా
డొక్క నిజాననాయతపుఁ దోఁటపుఁజంచువున న్వహించి
కొం, చెక్కుడు వేఁకఁ జంక్రమణ మొంతయుఁ దోఁపఁగ

చేరె నత్తఱిఁ, బెక్కులు వేచుప్రొంతల నెఱింగితి దాని
మహాప్రభావంబుగన్. ౧౫౬

వ. అంత నమ్మహాభాగంబు లంకాద్వీపంబునకుం బోయె. నప్పు డక్కడికేఁగఁ బయంబు ద్రిప్పిలి ధరం బడిన నేనును బోరున నందు నుండి తలఁచిర యాలపించుకొని యన్నెలవువాసి నలుదిక్కు లుం జూచుచు నరుగ నత్యంత శాంతులగు దైత్యులు కొందఱు నగుదెంచి నన్నుం గాంచి నీవు నరుండవు విది లంకానగరం బిప్పటికి నీవు వచ్చుట యచ్చెరువని పలికి మమ్మునేలిన కరుణావిభూషణు విభీషణుం గానుపించెదము రమ్మని తోడు కొనిపోయి సముఖంబుచేసిన నాపౌలస్త్యుండు చాలం గరుణించి సన్నుతుండనైన నన్నుఁ బ్రసన్నావలోకనంబున నిరీక్షించి యెక్కడనుండి వచ్చితివని యడిగిన నంతలోనన యొక్కయుక్తిఁ జూడఁగాంచి కరంబులు మొగిడ్చి. ౧౫౭

సీ. అనఘ జంబూద్వీపమున మదనోల్లాస
మనఁగ నింపొందు మహాపురంబు
నెలసి యందుల రమాధీశుండు నుద్భక్తి
వరదనామమున సేవకుల కెల్ల
వరము లిచ్చుచు నున్నవాఁ డమ్మకుందుని
నత్యంతభక్తి నేనాశ్రయించి
దేవ విభీషణదేవరఁ గాంచుపు
ణ్యంబు నాకిమ్మని యర్థి వేఁడ
దేవసన్నిధి నిద్రింప దివ్యమహిమ
నెవ్వరో నన్నుఁగొనివచ్చి యిచటనిడిరి

నిఖిలభాగవతాగ్రణి నిన్నుఁ గంటిఁ
బరమపుణ్యుని గాంచిన ఫలముఁ గంటి. ౧౫౯

వ. అనిన నెంతయు సంతసిల్లి కనకరత్నమయంబు లగు శంఖ
చక్రంబులును గదాంబుజంబులును దెప్పించి యవి యద్దేవు
నకు సమర్పింపు మని యిచ్చి నాకు దివ్యాంబరాభరణ
మాల్యంబులు నపరిమితకనకంబు ను నొసంగి యిరువురు
దైత్యుల రావించి వీని నీవస్తుసంతానంబును భరియించి మ
దనోల్లాసపురంబు సమీపంబున నునిచి రం డని పనిచిన
వారు నన్నుం గొనివచ్చి యన్నగరంబు చేరువ నునిచి మ
గుడ నరుగ నత్యంతమోదాయత్తచిత్తుండ నై నాకిచ్చిన
ధనంబు నొక్కకందువ దాఁచి తత్క్షణంబ. ౧౬౦

చ. కరముల శంఖచక్రములు గైకొని కాంచనరత్నభూషణో
త్కరములు దాల్చి నూతనవికాసమున న్మఱియు నివ్వటిల్లఁగా
సరసిజనాభుపోల్కి ని నిశాసమయంబున నేను జూపినే
వరసదనంబు సొచ్చుటయు వారని వేడ్కలు నివ్వటిల్లఁగన్.

క. వనజాక్షుఁడు వచ్చె నటం
చనుమోదముతోడ నిదియు నమ్మియు సాష్టాం
గనమస్కృతు లొనరించినఁ
గని నాచేఁ జిక్కెననుచుఁ గౌతుక మొసఁగన్. ౧౬౨

గీ. నేఁడు మొదలుగ వరియింతు నిన్ను నింక
నొరులఁ జేరంగనీ నన నుల్లసిల్లి
పుష్పకోమల యనురక్తిఁ బొంది యుండ
మకరదంష్ట్రియుఁ జిక్కె నామాయఁ దగిలి. ౧౬౩

నాఁటి నిశాసమయంబునఁ దోరణస్తంభంబున కడుగునప్ర డంతకమున్న యేమను నతిరయంబునం జని హరిమందిరం బెక్కి యేకాదశీ వ్రతపరాయణులై యున్న విప్రులు విన నేఁడు మహామారీపతనం బగు నేమఱకుండుం డని పలికి వారు గానకుండ నేను సురిఁగి యఱిగితి వారు వెడలి వచ్చి చూచి యరసి యెవ్వరిం గానక యది యాకాశవాణిపలుకుగా నిశ్చయించి. ౧౬౮

క. హస్తములు మోడ్చి శాంతి
స్వస్తికమంత్రములు నెరయ వారందఱు లో
కస్తుత్యోక్తుల దుర్గఁ
బ్రస్తుతి సేయంగ సర్వరాత్ర మగుటయున్. ౧౬౯

వ. అంతకమున్న యెవ్వరు నెఱుంగకుండఁ దోరణస్తంభం బెక్కి యున్న మకరదంష్ట్రి యయ్యవసరంబున. ౧౭౦

క. స్తంభాగ్రతలమునను స
స్తంభమ్మునఁ బవనుచేతఁ దల్లడపడుచుం
గుంభినిపై నుఱుకుదునా
యంభోరుహనయన యనుచు నతిరావమునన్. ౧౭౧

వ. ఎలుఁగిడిన నయ్యెలుంగు విని యిదియ మహామారీభాషణం బనుచు నమ్మహీసురులు మస్తకన్యస్తహస్తులై ప్రస్తుతింపుచు నోదేవీ! మాకీర్తనంబు లుల్లంఘింపక మామీఁద లఘింపక మమ్ము మన్నింపు మనుచు నుండ సైరింపలేక మకరదంష్ట్రి కంపంబు నొందుచు మఱియును. ౧౭౨

క. పడుదుం బడుదు ననంగాఁ
బడకు పడకు మనుచు వారు ప్రార్థింపంగా

నెడపని పలుకుల నైనంతయు
గుడిఁ బ్రతిధ్వానమును బ్రవణఘోరంబయ్యెన్. ౧౩౩

క. తెలతెలవాఱఁగఁ బోరులఁ
గలవారందఱును జూచి కలకల నగఁగా
బలునగుబాటుల కోర్వక
యిలపై నా జంత కూలి యార్తరవమునన్. ౧౩౪

వ. ఏ నిట్లా ఘోరంపుజలధి యభిమానంబును బ్రాణంబునం
గాని సమాధానంబున కామినితో నభిమతసుఖంబు లను
భవించుచు నున్నంత. ౧౩౫

క. కమలాకరుఁ డనుపతి చి
త్రముగాఁ దనమంత్రివరుఁడు వ్రాసిన నిజమై
నమహాప్రతి నున్నాఁ డ
త్యమితోన్నతి ననుచు జగము లాడఁదొడఁగినన్. ౧౩౬

క. ఆవార్తలు విని తత్పతి
పీవని మది నిశ్చయించి యిచ్చయలరఁగా
నావనితారత్నమునకు
నావృత్తాంతంబు చెప్పినం బ్రియ మెసఁగన్. ౧౩౭

క. ఏనును నీవుఁ గదలి య
మ్మానవపతిపురికిఁ బోదమా యనవుడు న
మ్మానినివచనంబుల క
త్యానందముఁ బొంది సకలధనములుఁ గొనుచున్. ౧౩౮

ఉ. దేవరఁ గాన నర్థిఁ జనుదేరఁగ నొక్కవనంబులోఁ గిరా
తావలి నన్నుఁ దాఁకిన నుదగ్రత నందఱ కన్నిరూపులై

చేవ దలిర్పఁ ఖడ్గమునఁ జెండఁ దొడంగిన బంధుల న్వెస
స్వైరతఁ బూన్చి తెచ్చి కదు వీఁక దలిర్పఁగఁ జుట్టుముట్టినన్.

క. తెగి వేఁను దనుమఁ బోడఁగనఁ
బగఁగొని ఖడ్గహతిఁ గొట్టి పైఁబడి కొండన్
దెగఁగాఁ గొండఱు గాల్చె
వెగయుకయును మొలఁగ మిడుకనీక యదిమినన్. ౧౮౦

క. పట్టు వడియుండ నొక్కటఁ
బట్టి నిగళబద్ధుఁ జేసి భామను సొమ్ముల్
ముట్టఁగొని యిచ్చోటికిఁ
బట్టుకొనుచు వచ్చి రిపుడు జలి యిచ్చుటకున్. ౧౮౧

వ. అంత నాభాగ్యంబున నిచ్చటికి దేవర విచ్చేసితి రనిన సత్యాంతసంతుష్టాంతరంగుం డై భీమభటాదులవలనం గనుంగొని నేఁ డిట్టిపుణ్యదివసం బగునే యని పలికి వసంతకునలను గనుంగొని వలయుభటవర్గంబుం గొని చని కిరాతపల్లి ముట్టఁ గొని మనసొమ్ములతోడ రూపింపం గొనితెం డనిన నపరిమితపరివారుం డై చిత్రకరాదులతోడ దాడివెట్టి శబరాలయంబు ముట్టికొని. ౧౮౨

చ. అమితకిరాతవీరులఁ గృతాంతునిపాలికిఁ బుచ్చి బోరునన్
రమణిని వర్ణనీయమృగరాజి ధనాదుల సందినోదపా
త్రము లగుపక్షుల న్శబరరాజమనోహరకన్యకావలిం
బ్రమద మెలర్పఁ గైకొని ధరావరుపాలికి వచ్చి రంతటన్.

శా. తారానాయకబింబరత్నకలశీధారాళనిర్యత్సుధా
సారాభ్రంకషదుగ్ధవార్ధిలహరీసంతాననిత్యప్రభా

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## పంచమాశ్వాసము.*

క. శ్రీచరణాంబుజసేవా
వైచిత్రీనిరత శిష్యవర్గమహాశ్రీ
ప్రాచుర్యమూలకరుణా
సూచితమాహాత్మ్య యన్నసూరామాత్యా. ౧

వ. అమ్మహీపాలునితో భేతాళుం డొక్కకథ వినుమని యి
ట్లనియె. ౨

### (5) భోజనవనితాశయ్యాచంగులకథ

మ. నతిపాత్ర మ్మగునంగదేశమున విష్ణుస్వామి యన్భూధవుం
డతిధన్యుండు శ్రుతాన్వితుండు మఖదీక్షాయుక్తుఁ డై సౌ
ఖ్యవి,శ్రుతులన్ యౌవనరమ్యులం దనదుపుత్రు ల్మువ్వు
రం జూచి త,త్త్రితయకృత్యంబున కొక్కకచ్ఛపము దేరం
బంచె వారాశికిన్. 3

క. పనిచినఁ జని వారిధితలం
బున నారసి యొక్కకూర్మముం గని పొలకం
పును బిచ్ఛిలంబు నగుత
త్తను వంటఁగ రోసి తరుణతాగర్వమునన్. ౪

*తృతీయ చతుర్థాశ్వాసములు లభింపలేదు.

ఘ్రాణితశాల్యోదనమును
భోజనవంగునకు మోదముఁ బెట్టుటయున్. ౧౦

క. అన్నంబు కమరువలచుచు
నన్నది భోజనము సేయ నొల్లక యుండఁ దా
నన్నఁ దొలంగి వచ్చిన
నన్నరపతి కారణంబు నరయించుటయున్. ౧౧

వ. పితృవనక్షేత్రంబునం బండిన ధాన్యంబున నైనయన్నం బిది
యన్నెలవు ప్రేతధూమావృతం బగుటచేతం గమరువలచెని
ని క్కముంగనే యని కొనియాడి. దాని భోజనచాంగుంగా ని
ర్ణయించి. ౧౨

గీ. ఒప్పు గలుగుదాసి నొక్కతెఁ జందన
మాల్యపట్టవస్త్రమండనములఁ
జెలువు మీఱునట్లు చేసి నాకిచంగు
పాల నందు మనుచుఁ బంచుటయును. ౧౩

వ. అది డగ్గఱిన నాసుభగుండు దానియొడలు మేఁకగదురు వ
లచుటయు న నాఘ్రాణంబు. ౧౪

గీ. ముక్కు మూసికొనుచు మునుకొని రోయుచుఁ
జాల నేవ పడుచు శయ్య డిగ్గి
యిట్టికష్టకాంత నెందును గానము
వెదకి యనిన మనుజవిభుఁ డెఱింగి. ౧౫

వ. ఆదాసిం బిలిపించి యిట్టికంపు వచ్చుటకుఁ గారణం బేమి
యని పరికించి. ౧౬

గీ. జనని కడచిన సత్యాంతశ్శైశవమునఁ
గోతి నదియొక్క మేఁకచన్గుడిచి పెరుఁగు

వ. అని కథ చెప్పి యీ మువురయందు జనకమరణం బెవ్వరిం
జెందు నని యడిగిన. ౨౫

సీ. ప్రకటంబుగా నేమపుఖండ్రుల క్రిందట
నున్నట్టి వెండ్రుక యొత్తినట్టి
యత్యంతభోగి శయ్యాచయంగుఁ బొందదు
కమఠంబుఁ బట్టినికడేఁదియఘము
మేలుఁ గీడు నెఱుంగఁజాలెడునట్టి త
జ్ఞులుగాని యెంతయు సుఖులుగారు
గాన భోజనమునకామినీచంగుల
యోగవిఘ్నంబున నైనయఘముఁ
దల్లిదండ్రులు గడచిన తద్వారితము
పొందు ననిన నదృశ్యుఁడై భూజమునకు
పోఁక వేతాళుఁడరిగిన వెంటనరిగి
బలమువిూఱఁగఁబట్టి భూపాలసుతుండు. ౨౬

వ. మఱిగిడి చనఁ దొడంగిన నింక నొక్కకథ విను మని వేతా
ళుం డిట్లనియె. ౨౭

—♦ (6) జ్ఞానవిజ్ఞానశూరుల కథ ♦—

సీ. సురపురిజయిని నాఁ బరఁగునుజ్జయిని ము
న్పుణ్యసేనుం డను భూవిభునకుఁ
జాల నిష్టుఁడు హరిస్వామి యన్విప్రుండు
వినుతచరిత్రుఁడై పెనుపునొందు
నతనికి వేదవేదాంగపారగుఁడు దే
వస్వామి యనియెడు వరసుతుండు

దనయ నిచ్చితి నేఁడవదినమునందు
నీకుఁ బెండ్లిచేసెద నని నిశ్చయించె. ౩౩

క. ఆతనిసుతుఁ డొక్కయెడ కొక
క్రతువునకుం జనిన నతనిఁ గని రూపబలా
న్వితుఁ డొకవిప్రసుతుండు స
న్నుతచరితా నాకు నీయనుజ నిమ్మనినన్. ౩౪

క. జ్ఞానివో శూరుండవో వి
జ్ఞానివో నాయనుజ యిట్టిచందము వానిం
గాని వరియింప దన్నను
నే నతిశూరుండ ననుచు నెంతయుఁ గడఁకన్. ౩౫

వ. ధనుర్విద్యాకౌశలంబును మల్లవిద్యాపెంపునుం బ్రకటించిన.

క. ప్రమదంబు నొంది విప్రో
త్తమ నాయనుజాత నిచ్చెద న్నేఁటికి స
ప్తమ మగుదివసమున వివా
హము చేసెద ననుచు నిశ్చయంబుగఁ బలికెన్. ౩౬

వ. ఇవ్విధంబునం బ్రత్యేకనిశ్చయంబులు చేసికొని హరిస్వామియు దేవస్వామియు సదనంబునకు వచ్చి యొండొరువులతోడం దమతమ నిశ్చయంబులు చెప్పక కన్యతల్లి నొడివిన దినంబునకు వలయుపదార్థంబు లలవరించి రంత. ౩౭

క. జ్ఞానియు శూరుండును వి
జ్ఞానియు నాలగ్నతిథికి సంభ్రమ మెసఁగం
గా నరుగుదెంచి రత్తఱిఁ
గానఁబడకపోయె విప్రకన్య యరుదుగన్. ౩౮

ఉ. దానికిఁ బట్టిశిష్టి వసుధామరవర్యుఁడు జ్ఞానిఁ జూచి యేం
మైనది దాతెసాడ యని యడ్గిన నంతకము న్వదృశ్యుఁడై
దానత్ర పరోకటఁ గింతిఁగొని తద్దయు వీఁకను వింధ్యభూమి
భృ, త్కాననభూమి దాఁచె ననఁగా విని యెంతయు సంభ్ర
మంబునన్. ౮౦

మ. తెజసార న్వాఁచేఁకతే నొకటి యాచిజ్ఞాలి గావించ సు
స్థిరశౌర్యుం బెనఁగంగ శూరవరుఁ డాతేకిస్తు వింధ్యావని
పరకాంతారము దాఁచె యుద్ధగతి నాదైత్యుం ద్రుమిం దాఁకి
భీ,కరబాణంబుల నాఁడు ద్రుంచి వడి నాకన్యామణిం దె
చ్చెనన్. ౮౧

సీ. కరము ముదమునంది పుత్రికఁ గౌఁగిలించి
తగిన పెండిలికొడుకుల మునుకఁ గాంచి
ముచ్చురును సమకాడు లే మువురయందు
దగినవాఁ డెవ్వఁడని చింతఁ దగిలియుండె. ౮౨

క. అని కథచెప్పి నరేంద్రా
ఘనులామువురందు విప్రకన్యావరణం
బున కెవ్వఁడర్హుఁ డనుటయు
జననాయకుఁ డిట్టు లనియె సరసత మెఱయన్. ౮౩

ఉ. ఆరసి జ్ఞానదృష్టిఁ గమలానన యున్నెడఁ జెప్పినాతఁడుం
దేరుఘటించి నాతఁడు మదింబరికింపఁగఁ గన్యరాకకుం
గారణమాత్రముల్ దనుజఘస్మరుఁడై వరవర్ణిఁ దెచ్చె నే
పారఁగఁ గాన శూరుఁడ మహార్హుఁడు కన్యవరింప నావుఁడున్

క. ఘనరయమున వేతాళుఁడు
చని తరు వెక్కుటయు వెంటఁ జని పతి మగుడం

గోవిశేరంగ నింకొకకథ
విను మది యూతనికి వింతవేడుక దనరన్. ౪౬

—• (౭) మదమంజరికథ •—

క. మనుజేశ్వర శుద్ధపటుం
డనుచు జనకుం డొకండు మోహనాకార మహా
జనవినుతను మదమంజరి
యనియెడువరపుత్త్రిం గనియె నంబవరమునన్. ౪౭

వ. అన్నారీమణి మోహనాకారంబు గనుంగొని ధవళుం డను రజకుండు మనోభవాధీనమానసుం డైన వానిజనకుం డెఱింగి వానిజనకుల నొడంబఱిచి యక్కన్యం దనతనూజునకు వివాహంబు గావించుకొని పురంబునకుం దోకొని పోయిన.

క. ధవళుండును వేడుక నా
ధవళాంశుముఖి స్వీయాత్మ ధవళాంబుజచా
రువిలోచనం బొంది మనో
భవసౌఖ్యము నొందుచుండెం బాయనివేడ్కన్. ౪౮

ఉ. అంతట నొక్కనాఁడు దనయల్లుని గూఁతును దోడితేర న
త్యంతముదం బెలర్పఁగ నిజాత్మజు శుద్ధపటుండు పంపఁగా
నెంతయుఁ బ్రీతి వారు డరిగి యిద్దఱుఁ దోడ్కొని యేగుచుం
డుచో, సంతతశోభితం బయిన చండికగేహము పొంత న
క్కడన్. ౪౯

క. ధవళుండు దనమఱందిని
ధవళేక్షణ నచట డించి తా నొకరుఁడుఁ బ్రభో
ధవళ మగు భద్రకాళీ
భవనంబున కేగి యధికభక్తియుతుం డై. ౫౦

క. తను వీడి కడుఁ బ్రేమేసఁగ
ముని బ్రొంకాలి చని కర్ణారమునఁ దనగళముఁ
దునుముకొని తల యమానద
ఘనజంబులమీఁద నిలిపి ప్రాణ ధరిత్రిన్. ౫౧

వ. అప్పుడా గాండగక యొండయుం దడ వెమునమాచి వాని మజంది దేవిమందిరంబున కరిగి యాచందం బై నయతనిం గ నంగొని చెండంబునం ద్రుళ్లిళ్లి నాకు వినిత్రోచిన లోకంబు గాక యని శిరంబు ద్రెంచుకొని తానునుం గూలిన. ౫౨

క. పడఁతుక యయ్యుద్దణం బటఁ
దడయలకును మది భయంబు దనుకఁగ వెస న
గ్గుడిలోని కరిఁ యిరువురఁ
బడినవిధముఁ జూచి శోకభయవిహ్వల యై. ౫౩

క. ఆవరుఁడు సహోదరుఁడును
జీవంబులఁ బాసి యుండ జీవముతో నే
నివార్త తల్లిదండ్రుల
కేవిధమునఁ జెప్పఁ బోదు నిం కిట ననుచున్. ౫౪

క. జీవంబు విడుచుతలఁపున
దేవీభవనంబుపొంత దీర్ఘతరువునం
దీవ యురి వెట్టి తత్పతి
యావిశ్వపవిత్రి నిట్టు లని నుతియించెన్. ౫౫

శా. శ్రీరామాధిపవాగ్వధూవరులు నీశ్రీపాదసేవారతుల్
శ్రీరమ్యంబులు నీమహత్త్వములు నీశృంగారసాహిత్యలే
ఖారూపంబు మహేశుదేహము జగత్కళ్యాణి నీసత్త్వమె
వ్వారుం బ్రస్తుతి సేయనేర్తురె కృపావారాశి కాత్యాయని.

వ. అని వినుతించినఁ బ్రసన్నురాలై యాజగన్మాత సోదరునిం బతిని బ్రతికించెద నయ్యిరువురశిరంబులు దేహంబులఁ గదియింపు మనిన సంతసిల్లి యంధకారంబున నెఱుఁగక. ౫౭

గీ. మగనిబొందె నన్నమస్తకం బానకూర్చి
యన్నశిరము మగని నంటఁగూర్పఁ
దలఁచి కీడువడినతనువులతో వారు
జీవకలితు లైరి దేవికరుణ. ౫౮

వ. అని కథఁ జెప్పి వేతాళుండు నరేంద్రా వీరిలోన నింతికిం బతి యెవ్వఁ డగు నని యడిగిన నవ్విభుఁడు సకలేంద్రియంబులందును శిరంబు ప్రధానం బగుటఁ బతిశిరంబువాఁడు పతి యగు ననిన వేతాళుఁడు చప్పటించుచు తనువున కరిగిన మగుడం బట్టి తెచ్చినప్పుడు వేతాళుం డతని యాతాయాతంబుల డస్సితివి యే నడుగుప్రశ్నంబుల కుత్తరంబులు సెప్ప నీవ కాని యెవ్వడు నేర డింక నొక్కకథ విను మని యిట్లనియె

## —♦ (8) దేవసేనచరిత్రము ♦—

క. మును వీరబాహుఁ డనియెడు
మనుజేశ్వరువీట రూపమహిమోన్నతుఁ డై
పెనుపొందెను ధనవంతుం*
డను వైశ్యకుమారుఁ డుజ్జ్వలాకారమునన్. ౬౦

గీ. అతఁడు దేవసేన యనియెడుకన్యక
యౌవనాభిరామ ననఘధామఁ
జూచి మన్మథాస్త్రశోషితహృదయుఁ డై
యాత్మలోనఁ దాప మగ్గలింప. ౬౧

* ధనదత్తుఁడు, ధర్మదత్తుఁడు – అని యీకథలో నేకలను

క. పరమేశ్వరాలింగిత యయి
ధ్వరతరంబగు గాల్పు మంటతోడను మనకుం
దరతరమే పెండ్లము నొచ్చిన
కరణిం గామాగ్ని యోర్వఁ గాల్పఁబోదఁగఁగదన్. ౬౨
వ. అనాలుఁగంటి యొంటి విహరించు నెడకుం జని తలం పెఱిం
గించిన నది లజ్జావనతవదన యగుచు ని ట్లనియె. ౬౩
గీ. నను సముద్రదత్తుఁ డనుగుణాధికునకు
నిచ్చినాఁడు తండ్రి యెల్లి పెండ్లి
యనఘ నేను బరుని యంగన నై యుండఁ
దగునె యిట్టితలంపుఁ దలఁప నీకు. ౬౪
క. అనుటయు నాథనదత్తుఁడు
మనసిజదహ్యమానమానసుఁ డై ప్రా
ర్థన మొనరింపంగా ని
ట్లనియెం గమలాయతాక్షి యతిమధురముగన్. ౬౫
గీ. పెండ్లి యాడి యేను బ్రియుని బొందకమున్న
నిన్నుఁ జెందుదాన నిక్కువంబు
నమ్ము రాకయున్న నాసుకృతము నీద
యనినఁ బ్రియముతోడ నరిగె నతఁడు. ౬౬
సీ. అపరదినంబునయందు శోభనలగ్న
మాసన్న మగుటయు ననుపమహిమఁ
దల్లియుఁ దండ్రియుఁ దగుకులోచితమంగ
ళోపచారములు పెంపొందఁ జేసి
చెలువారఁ గన్యకు శృంగార మొనరించి
భద్రంబు మీఱ సముద్రదత్తు

నన్నుఁ బెండ్లి యొనరించి నాఁటి నిశావేళ
నాతనికే య్యకు ననుచుటయును
దనమునంబున నెంతయుఁ దమక మడరఁ
గవియు వేడుకపడిన నాకాంతుతోడ
భయము లజ్జయు మదిలోనఁ బాయఁబెట్టి
యంతయును ధైర్యమున నింతి యిట్టు లనియె. ౬౭

గీ. అధిప యేను సత్యహానికి నోర్వక
యొకటి నీకుఁ జెప్ప నుత్సహించి
వెఱచి యున్నదాన విపులధైర్యముతోడ
నవధరింపవలయు నత్తెఱంగు. ౬౮

వ. నిన్న ధనదత్తుఁ డనువాఁడు నన్నుఁ గామించి యేకతంబునం బట్టి నమకట్టిన వాని వారించుటకు నోర్వక యేను వివాహానంతరంబున వచ్చెద నని వానికి సత్యంబు చేసితి నాస త్యంబుఁ బాలింపు మనిన నోడంబడి సముద్రదత్తుండు తన్నుఁ బంచిన. ౬౯

క. ఆరమణి రత్నభూషణ
హారావళి వెలుఁగ నొంటి నరుగఁ దొడంగెం
దారావళివృతమూర్తి
స్ఫారాకృతి యొప్పు రాత్రిసతియుం బోలెన్. ౭౦

వ. ఇట్లు విజనం బగు పౌరమార్గంబున నిరర్గళగతి నరుగు సమయంబున. ౭౧

సీ. మిడిగ్రుడ్డులును గోరమీసంబులు మహాభు
జములు విస్తీర్ణవక్షఃస్థలంబు

నతికిరీటంబుఁ గాలాంజనాభము నైన
విగ్రహంబును గుజ్జునెంట్రుకలును
కోలాంబకంబును నిర్దయభావంబు
నత్యంతభయదంబు నగుచుఁ దనరు
ఘనదరీవిలాంధకారాదిభయాకర
శబరసేనాపురస్సరుండు గొల్ల
నసమనక్షత్రరత్నసౌఖ్యమున కంబ
రంబుఁ బ్రాఁకి నమర్చిన రజ్జు వనఁగ
మెఱసి యసిదీప్తిపుంజంబు మిన్నుముట్టఁ
జోరుఁడొక్కండు వచ్చి యాసుదతిఁ జేరె. ౭౨

క. ఎక్కడిదానవు నడురే
యెక్కడికిం బోయె దొంటి నిప్పుడు నాచేఁ
జిక్కితి రమ్మని యక్కజ
యక్కటికము దొలఁగి తమక మడరెడుమతితోన్. ౭౩

గీ. రాజవదన యేఁ జోరులరాజ నాకు
నీవుఁ దొడవులుఁ జిక్కితి నిలువుమనుచు
మగువ కరపంకజమువట్టి తిగిచె రాజ
కదళిఁ గబళించు నున్మదగజ మనంగ. ౭౪

వ. ఇట్లు కరంబు వట్టి తిగిచినం గరంబు భయంబునొంది య
ద్దైన నీతొడవులు గైకొని నన్నరుగంగనిమ్ము క్రమ్మఱ
మగిడి వచ్చెద ననిన నవ్వుచు నవ్వనితం గనుంగొని. ౭౫

చ. మనసిజరాజ్యలక్ష్మి యగుమానవతీమణి నేకతంబునం
గనుఁగొని యిచ్చ నీప్సితసుఖంబులఁ బొందక నీవు వోయిర
మ్మనినమెదు కూళుఁడుం గలఁడె యంగన యిట్టులు వల్క

జేటికి, స్వసితలు లేఖులు న్మాడి వచ్చుట గల్గునె పాపిపో
యినన్. ౭౩

క. అనవుడు నావనజానన
తనవృత్తాంతంబుఁ జెప్పి తడయక వత్తుం
జననిమ్ము బొంక నావుడు
విని చోరుం డాత్మలోన విస్మితుఁడగుచున్. ౭౪

సీ. వామాక్షి క్రమ్మఱ వచ్చుట నిజమేని
మును నీవు ధర్మదత్తునకుఁ జేసి
నట్టి సత్యమునేయు మనుటయుఁ బ్రియమంది
యాపద్మలోచన యట్ల చేసెఁ
దస్కరుకడఁ బాసి ధర్మదత్తునిపాలి
కరుగుటయు ను జోద్యమంది యతఁడు
సత్యంబు దప్పక చనుదెంచినప్పుడ
వరదేవతవు నీవు పద్మగంధి
కన్యవైననాఁడు కడువేడ్కఁ గోరితి
గాని యిప్పు డన్యకాంత వైతి
కాన నిన్నుఁ జేరఁ గాంతునిపాలికిఁ
జనుము నెమ్మి ననుచుఁ బనుచుటయును. ౭౫

క. ఇంతి యసత్యభయంబున
నెంతయు వెసఁ జోరుకడకు నేగి తనదువృ
త్తాంతముఁ జెప్పిన మది న
త్యంతాశ్చర్యంబు నొంది యాతఁడు కరుణన్. ౭౬

క. నీసత్యమునకు మెచ్చితి
నీసత్యముఁ దగవుఁ గలదె యింతులకెందున్

నీసొమ్ము నిన్నుఁ గైకొను
నా నయుచిత వాక్యకథకు నసుగు మనుటయున్. ౭౦

క. తన పతికడకుం బోఁ జని
వనితామణి తాను బోయి వచ్చిన విధ మె
ల్లను జెప్పిన విని పతి మె
చ్చొనరంగఁ గైకొని సుఖాబ్ధి నోలలాడెన్. ౭౧

వ. అని కథచెప్పి వేతాళుండు. ౭౨

క. అమువ్వురలో సాత్త్విక
తామహితుం డారయ ధనదత్తుండో చోరుం
డో మగువమగఁడో యనుటయు
నామనుజాధీశుఁ డిట్టులను నాతనితోన్. ౭౩

సీ. పరపురుషునికడ కరిగెద నన్నఁ బ్ర
విడువంగఁదగు నింతి విడువఁడయ్యెఁ
దలపోయఁగ సముద్రదత్తు చిత్తంబున
సత్త్వగుణంబు లేశంబు లేదు
పరకాంత నృపదండభయముసఁ గవియని
ధనదత్తునందు సత్త్వంబు లేదు
ముచ్చు ప్రాణములపై వచ్చినం జేరిన
యర్థంబు విడువని యట్టివాఁడుఁ
దలఁప నిట్లయ్యె లోభ మింతయును లేక
మణివిభూషలు మానినీమణియుఁ దనకు
నబ్బి యుండఁగఁ బొమ్మని యట్లు వనిచె
జగములోపలఁ జోరుండె సాత్త్వికుండు. ౭౪

వ. అనిన వేతాళుండు జనపతికి నదృశ్యుం డగుచు వృక్షంబున

కలిగిన వెనువెంటం జని తన్ను మనుజవిభుండు పట్టి తెచ్చు
నప్పుడు మఱియు ని ట్లనియె. ౮౫

క. అడిగిన నెవ్వారికి నే
ర్పడఁ జెప్పఁగ రానియట్టి ప్రశ్నంబులు చో
ద్యపడఁ జెప్పితి నీమదికిం
గడ గలదే యింక నొక్క కథ విను మనియెన్. ౮౬

## —♦ (౫) వైశ్యకన్యకథ ♦—

సీ. (పూర్వకాలంబునను) భానుపురమునందు
ఘనుఁడు సూర్యప్రభుం డను మనుజనాథుఁ
డలఘుకీర్తి చందనమలయాద్రి యనఁగ
నెమ్మి రాజ్యంబు సేయుకాలమ్మునందు. ౮౭

క. ధరలోనఁ దామ్రలిప్త
పురి ధనదత్తుఁ డను వైశ్యపుంగవుఁడు మనో
హరకాంతిరూపగుణములఁ
గర మరుదుగఁ దనరునట్టి కన్నియఁ గనియెన్. ౮౮

క. కప్పారు తుఱుమునున్నతి
యొప్పారెడు చన్నుఁగవయు నురుతరగరిమ
న్నొప్పారు నితంబంబును
నప్పొలఁతికి జవ్వనమున నందము చేసెన్. ౮౯

క. అంతట విధికృతి జనకుం
డంతము నొందుటయుఁ దాను నమ్మయు దుఃఖా
క్రాంతయయి రాజవరులకు
నంతయు భయమంది యర్థమెల్లను గొనుచున్. ౯౦

వ. పుత్రియుం దానును నర్ధరాత్ర సమయంబునఁ బురంబు నిర్గమించి. ౯౧

క. తమఃక్షితికోకతమములఁ
దమమధికంబైనఁ బెదరువుదప్పి యరిగి తా
లమున నిడిన దోఁచని న
గ్రమునఁ గని యులికిపడుచుఁ గంపించుతఱిన్. ౯౨

క. వడిఁ గొజ్జు కంకమున వెలు
వడి యనికిం జేరి దొప్పినజనఁగ నాఁడుం
గడుపుబ్బు ములుగఁ గొడఁగిన*
వెడగలుగుచు వైశ్యకాంత యొవ్వఁడవనినన్. ౯౩

మ. తెలవా చోరుఁడ శూలసంగతుఁడ నై తీం గ్రూరకర్మంబుచేఁ
గొఱఁతం బొందితిఁ జావురా దకట నాకుం దొల్లి పాపంబులే
గుణ్ లేకుండఁగఁ జేయఁబోలుదుఁ గడున్ గుప్పించె జిల్వే
దన, లజ్జ నై యొందును బాపకర్మలకు నేలా మంచిచా
వచ్చెడున్. ౯౪

వ. అని పలికి యీ వైశ్య వైశ్యాలనికిం బోయెద రనిన నవ్వనిత
నియె. ౯౫

క. పతిచచ్చినఁ దల్లడిలుచు
సుతఁ దోకొని దిక్కునూలి చుట్టలకడకున్
గతి చెడి పోయెద నని తా
నతిదుఃఖిత యగుచునుండె నాసమయమునన్. ౯౬

క. రేరాజు పొడిచి యెక్కినఁ
జోరుం డావైశ్యకాంతసుత నతిసుభగా

* కడుపుర్గములంగ్గందొడంగిన- వెడగలయుచు.

కారం గనుఁగొని కనుఁ బ్రియ
మారఁగ ని ట్లనియె దానియంబికతోఁ దక్. ౯౭

సీ. అమితధనంబు శుల్కముగ నిచ్చెద నీకుఁ
దనయ నాకొసఁగి చేదారవోయఁ
బుత్రార్థముగ నన్యపురుషుని బొందంగ
ననుమతి యిచ్చెద నవ్విధమునఁ
బుత్రునిఁ గనిన నాపుత్రుఁడై వాఁడు దు
ష్కర్ముని నను నూర్ధ్వగతికిఁ బుచ్చు
నాత్మసంభోగసౌఖ్యానందకందళి
తాభిలాషుండనై యడుగ నిపుడు
వీఁడు గాఁడు లాఁడెవు నని విడిచిపోక
యింతినిచ్చెద ననుమన్న నియ్యకొనుఁడుఁ
దన సమీపంబునందున్న ధనము నూపఁ
బుచ్చుకొని తనసుత దారవోసె; నతఁడు. ౯౮

వ. ఇట్లు ధారవోయించుకొని ప్రముదితాంతరంగుండై సంతా
నార్థంబుగా నక్కన్య యన్యపురుషుం బొంద ననుమతి యి
చ్చి యాక్షణంబ ప్రాణంబులం బాసిన నచ్చోటు వాసి
ఘనం బగుధనం బొబరించుకొని పుత్త్రికాసమన్విత యై
సూర్యప్రభుని పురంబునకుం జని ధనంబిచ్చి తగువారిచేత
నచ్చోరునికి నగ్నిసంస్కారములు చేయించి తన పితంద్రి
యగు ధనపాలుని మందిరంబునకుం జని సుస్థితినుండి యొక
నాఁడు. ౯౯

క. సౌధమున నుండి వేడుక
నాధనవతి యొకమహీసురాత్మజు రూప

శ్రీధాముని వరకాంతిసు
ధాధాముని జూచి రాగతరళిత యగుచున్. ౧౦౧

క. మానసభవబాణాహతి
మానము గోల్పోయి తనదుమాతకు మదిలో
నూనినవిప్రకుమారుని
పై నెయ్యముఁ దనదుతాపభరముం దెలిపెన్. ౧౦౨

వ. ఇట్లు దెలిపిన జారవాక్యంబు మనంబునం దలంచి యఘం
బు లేమికి నిశ్చయించి యెవ్వరు నెఱుంగకుండ వానిం దో
తేర నొక్కదూతికం బుచ్చిన నాసాబగుం డిట్లనియె.

గీ. పంచశతరూప్యకంబులు వాయ కేను
నిచ్చలు వ్యయంబు సేయుదు నేఁడుమాత్ర
మిష్టం జేసూఱుటూకల నిచ్చితేని
నరుగుదెంతు లేకున్న రా నటుచుఁ బలికె. ౧౦౩

ఉ. అప్పుడ యేగి దూతి యతఁ డాడినమాటలు వైశ్యకాంత
కుం, జెప్పిన దానిచేతికిని శీఘ్రము యర్థము నిచ్చి యేరికిం
జెప్పక రాత్రి రమ్మనినఁ జేకొని తా నదురేయి వచ్చి య
య్యొవ్వనలకన్య నింపుమెయి నోలల నార్చె సుఖాంబురాశి
లోన్. ౧౦౪

వ. ఇత్తెఱంగున నత్తెఱవతోడి యభీష్టలీలలం దగిలి యారాత్రి
గడపి ప్రభాతంబున నిజనివాసంబున కరిగి హారలతానామ
వారవనితాలోలుం డై యుండెఁ, దత్సమాగమంబున వై
శ్యపుత్రి దౌహృదలక్షణంబున నుల్లసిల్లె. ౧౦౫

క. గొంతివిధంబున గర్భం
బెంతయు గూఢముగఁ దాల్చి యనసమతేజం

శ్రీధాముని వరకాంతిసు
ధాధాముని జూచి రాగతరళిత యగుచున్. ౧౦౦

క. మానసభవబాణాహతి
మానము గోల్పోయి తనదుమాతకు మదిలో
నూనినవిప్రకుమారుని
పై నెయ్యము దనదుతాపభరముం దెలిపెన్. ౧౦౧

వ. ఇట్లు దెలిపినం జోరవాక్యంబు మనంబునం దలంచి యఘం
బు లేమికి నిశ్చయించి యెవ్వరు నెఱుంగకుండ వానిం దో
తేర నొక్కదూతికం బుచ్చిన నాసాబగుం డిట్లనియె.

గీ. పంచశతరూప్యకంబులు వాయ కేను
నిచ్చులు వ్యయంబు సేయుదు నేఁడుమాత్ర
మిష్టం జేనూఱురూకల నిచ్చితేని
వరుగుదెంతు లేకున్న రా ననుచుఁ బలికె. ౧౦౩

ఉ. అప్పుడ యేగి దూతి యతఁ డాడినమాటలు వైశ్యకాంత
కుం, జెప్పిన దానిచేతికిని శీఘ్రముకు యర్థము నిచ్చి యేరికిం
జెప్పక రాత్రి రమ్మనినఁ జేకొని తా నపురేయి వచ్చి య
య్యొవ్వలకన్య నింపుమెయి నోలల నార్చె సుఖాంబురాశి
లోన్. ౧౦౪

వ. ఇత్తెఱంగున నత్తెఱవతోడ యభీష్టలీలలం దగిలి యారాత్రి
గడపి ప్రభాతంబున నిజనివాసంబున కరిగి హారలతానామ
వారవనితాలోలుం డై యుండెఁ, దత్సమాగమంబున వై
శ్యపుత్రి దౌహృదలక్షణంబున నుల్లసిల్లె. ౧౦౫

క. గొంతివిధంబున గర్భం
బెంతయు గూఢముగఁ దాల్చి యనసమతేజం

భాతంబున నగరివాకిట నుండెడుఁ గైకొని పెనుపు మవి
యానతిచ్చిన నానతుఁ డై యానందంబునుం బొంది వేకువ
నగరిమొగసాలకుం జని యబ్బాలునిం గాంచి మహోత్సవం
బు లొనరించి చంద్రప్రభుం డను పేరిడి పెనుప నక్కుమా
రుండు గ్రమవర్ధితుండును, సకలవిద్యావిశారదుండును నై
సంపూర్ణయౌవనంబు నొందినసమయంబున. ౧౧౨

క. శ్రీకరుఁ జంద్రప్రభు నిల
కభిషిక్తుం జేసి (యచటి) కరిగి నగసుతా
విభుఁ గొలుచుచు సూర్యప్రభుఁ
డభినవయోగాభినిష్ఠ నసువులు నొఱఁగెన్. ౧౧౩

క. జనకుండు మేను దొఱఁగుట
విని చంద్రప్రభుఁడు నాత్మ వివశుం డై యో
లిన పారలౌకిక్రియ
లనూనముగఁ జేసి తా గయకుఁ జని యచటన్. ౧౧౪

వ. వేదచోదితానుష్ఠానంబు నొనరించి పిండప్రదానంబు సేయం
గరం బెత్తుటయు నక్కజంబుగా నాసమయంబున. ౧౧౫

గీ. అంచిత పవిత్రభూషణం బైనకరము
కంకణసముజ్జ్వలం బైనకరము గాఁగ
నలఘుశంఖశస్త్రాంకిత మైనకరము
మూఁడుకరము లాభూపాలుమ్రోల నిలిచె. ౧౧౬

క. ఆకరములఁ గని (ఘన)చిం
తాకులమతి యగుచుఁ బిండ మాతరములలో
నేకరమున నిడనేరక
వే కరముం దిగిచికొనుచు విన్నఁదనముతోన్. ౧౧౭

వ. వేదశాస్త్రపారగులగు నప్పటిపెద్దలకు నాహస్తములు సూపి యిట్లగుటకుం గారణం బేమి యని వారు విచారించి యి ట్లనిరి. ౧౧౮

చ. పరమపవిత్రహస్త మిది బ్రాహ్మణహస్తము శంఖశస్త్రభా
సుర మయియున్నహస్త మిది చోరునిహస్తము రత్నకంకణ
స్ఫురణ దలిర్చుహస్త మిది భూపతిహస్తము వీనిలోన నే
కరమును బాత్రమో నిజముగాఁ గన రా దని పల్కి రం
దఱున్. ౧౧౯

వ. అని కథ చెప్పి వేతాళుండు భూపాలా యాకరంబులమూఁటియందు నేకరంబు పిండప్రదానంబున కర్హం బని యడిగినం బుడమిఱేఁ డి ట్లనియె. ౧౨౦

ఉ. కొంగున మూడ లూడ్చికొని కొడ్కుని పెంచినరాజు తండ్రి
గాఁ, దంగజకేళికార్థము తదంబిక వేఁడిన విప్రుఁడుం దలం
పంగ గురుండు గాఁడు కులభామిని గాఁగ వరించె వాని
మాతృం గమియంగ నర్థ మిడి తండ్రగుఁ జోరుఁడు వాని
కారయన్. ౧౨౧

వ. పిండప్రదానంబునకుం జోరుకరం బరయ నర్హం బనుటయు నదృశ్యుం డై యెప్పటిభూజాతంబున కరుగ వెనుకన చని తన్నుం బట్టి తెచ్చునెడ వేతాళుండు నమ్మహీపాలున కి ట్లనియె. ౧౨౨

క. ఎన్నెనియుఁ బ్రశ్నములకు
నెన్నఁగఁ దగు నుత్తరంబు లిచ్చితి నాకున్
నన్ని ట్లలజడి వెట్టుచు
నున్నాఁ డని తలఁప కింక నొకకథ వినుమా. ౧౨౩

## —• (10) ధర్మరాజుకథ •—

క. మనుజేశ ధర్ముఁ డనియెడు
మనుజాధీశ్వరుఁడు, తొల్లి మాత్తురఁ జేరన్
ధనమును రాజ్యముఁ గోల్పడి
తననగరము విడిచి తరళితస్వాంతుండై. ౧౩౪

క. ఆవిభుఁడు ఖడ్గదీప్త
హ్యావృతహస్తుఁ డయి చంద్రవతి యను దేవిన్
లావణ్యవతి యనెడుసుత
నావనమునఁ గొనుచు నొకఁడు నరిగెడువేళన్. ౧౩౫

చ. అలఘుమణిద్యుతిం బొలుచు నావిభు భూషణరాశిఁ జూ
చి బోయలు గదుమీఁకఁ దాఁకుటయు నందఱు మున్నిడి
శాతహేతి నిర్ధళితులఁగా నొనర్చి భుజదర్పము మానక ని
ల్చి వారిచే, నలుగులవేదన స్వవశుఁడై హరివీటికిఁ దాను
నేగినన్. ౧౩౬

ఉ. అన్నరనాథుఁ డీల్గుటయు నాతనికామిని దానుఁ బుత్రియు
న్విన్నఁదనంబు దోఁప నటవీస్థలి నేగెడుచోటఁ జన్నులుం
బెన్నెఱివేణులున్ జఘనబింబములుం గడు వీఁగఁ జేయఁగా
సన్నపుఁగౌను లెంతయును సంచల మందఁగ నార్తిఁ గూరు
చున్. ౧౩౭

క. ఉలుకుచు నేగిరి వెనఁ బె
బ్బులిరాకకుఁ దొలఁగులేళ్లపోలికి భయసం
చలితవిలోచనసిలో
త్పలరోచులు గప్పి విపినభాగము లొప్పన్. ౧౩౮

వ. ఆ ట్లరిగి యరిగి యత్యంతపథశ్రాంతి నొంది. ౧౭౯
క. *లుంగలవంగ

నక్క గిరిసరసీ

తుంగతలవనముం జూక్షి ల
తాంగులు వెస నడంగి యుండి రచ్చట నంతన్. ౧౮౦

వ. చండవిక్రముం డనుమండలనాథుండు సింహవిక్రముం డనుత
నయుండునుం దాను నక్కాననంబునకు వేంట వచ్చి య
ప్పొలంతులు చనినచొప్పు గాంచి పుత్త్రు నవలోకించి.

క. అడుగులు నిడు పగు కాంతయు
నడుగులు కందుచ లగునంబుజాక్షియు నుభయుం
బడరం జనినారు వీరలం
బొడగని (మన)పురికిం గొంచుం బోయెదమేనిన్. ౧౮౧

క. చరణములు నిడుపు లగునా
సరసీరుహనేత్ర నాకు సన్నపుం బాదాం
బురుహములయింతి నీకును
†గరసీత లటంచు నాత్మ కౌతుక మొసంగన్. ౧౮౨

క. చరణంబులచొప్పునం జని
సరసీతటికాననమున శ్రమపడిన మనో
హరవనదేవతలో యనం
గర మొప్పెడుసతులం గాంచి కడుముద మొదవన్. ౧౮౩

ఉ. వాడియు నొప్పు సేసె ముఖవారిరుహంబులు ఘంటికావళి
న్వాడియు వేడ్కం బెంచె నెఱవేణులు గ్రమ్మెడుఘర్మవారి

---

* లుంగలవంగచూతమల గంధములం జెనంగినక్క—మూ.

† కరిణీతలలంచు—మూ.

లోఁ, గూడియు సమ్మదంబు నొందఁగూర్చెను మేనులు చూ
డ్కి భీతి న, ల్లాడియుఁ బొల్చె సీపతులయందము సుస్థితి నె
ట్టు లుండునో. ౧౩౫

వ. అని యిట్లభిదించి సమయంబు చేసికొనినవిధంబునం బె
ద్దయమనుగులముద్రియుం దంద్రడియుం గుఱుచయమనుగులతేఱవఁ
బుత్రుండును సత్యానురాగంబునం గైకొని పురంబునకుం గొ
ని చని యుల్లసయ్యింతులవిధం బంతయు నెఱింగి. ౧౩౬

క. కుఱుచమనుగులయది తల్లియుఁ
గుఱుచలు గానమనుగులయది కూఁతురు నయినన్
నెఱఁ గంది వారినియతిం
దొఱఁగక వరియించి రరయ దుర్నయ మైనన్. ౧౩౭

వ. అని కథ చెప్పి వేతాళుండు నరేంద్రా వారికువురకును న
య్యారిజనేత్రలవలన ననేకపుత్రు లుదయించిరి తత్తనయులు
దమలోన నేమి యగుదు రని యడిగిన. ౧౩౮

క. ఎప్పగిది విచారించినఁ
జెప్పంగానేర రాక చింతాకులుఁడై
చెప్పఁగరా దీప్రశ్నముఁ
జెప్పుమనుచు నడిగె నేమి సేయుదు ననుచున్. ౧౩౯

వ. నిర్విణ్ణుం డై మౌనంబునం జనుచున్న యమ్మానవేంద్రువ
లన సంతుష్టుం డై వేతాళుం డిట్లనియె. ౧౪౦

మ. ధరణీనాయక నీదుశౌర్యమును సత్యంబుం బ్రతాపంబు ని
ద్దర నెవ్వారికి లేదు నీ దగుచరిత్రం బెప్డు విన్వారలం
గర మర్థిం బులకింపఁ జేయుచు శిరఃకంపంబు చేయించు నీ
సరిగా నెన్నఁగఁ బోలు రాజు గలఁడే సర్వజ్ఞచూడామణీ.

చ. నరవర బ్రాహ్మణుండు నిను నాకుపహారము సేయఁ బూ
నె నస్థిరుఁ డతిపాపచారి ననుఁ దెమ్మని పంచుట నిట్లు నీ
వు న, స్వరమతిఁ గొంచుఁబోవుటయు నాకుఁ బ్రణామము
సేయఁ బంచి నీ,శిరము హరించుఁ డోనె యిట్లు చెప్పితి నీ
కు హితోపదేశమున్. ౧౪౨

క. నిను నాకు మ్రొక్కు మనఁగా
మును మ్రొక్కు టెఱుంగ నేను మ్రొక్కువిధ మి
ట్లని చూపు మనుచు మ్రొక్కఁగ
దునుము వెస న్వానిశిరము దోరసిచేతన్. ౧౪౩

వ. ఇవ్విధంబు నాచేత వినక మోసపోయితేని నీశరంబు నను హృ
దయపద్మంబు నను నాకు నివేదించి వాఁడు విద్యాధరచక్రవ
ర్తిపదంబు నొందు నీవు పరమపుణ్యుఁడవు గావున నీ కట్టి
యుపాయంబు పుట్టదు నీవు వానిశిరంబు ద్రుంచి తదనంత
రంబ తద్వక్షోదళనం బాచరించి హృదయపద్మంబు పుచ్చి
నన్నుం బూజింపుము నీకు మనోరథసిద్ధి యయ్యెడు నని దీ
వించి యే నీశవంబురూపంబునం బాసి యవ్వటవి కరిగి భి
క్షుం డాకర్షింప వచ్చి యందుఁ బ్రవేశించి నీకు వరదుండ
నయ్యెద నీవు దీని నేదియు నెఱుంగనివాఁడవుగా నీకళేబ
రంబుఁ గొని చను మని పంచిన వినతుండనై యమ్మేదినీ
కాంతుండు. ౧౪౪

క. ఆక్షణము శవము గొనిచని
భిక్షునకొగి నిచ్చుటయును బ్రియమున నీన
ర్వ్యక్షితియు నీవ యేలుచు
నక్షయ మగుపెనుపుఁ బొందు మని దీవించెన్. ౧౪౫

వ. ఇట్లు తపోధనుండును బోలె నాశీర్వాదంబుచేసి. ౧౪౬

సీ. వివిధసత్సాధనవిరచితం బగుచు వి
చిత్రచిహ్నంబులచెలువు గలిగి
యుండెడు నయ్యగ్నికుండంబులనడుమ
నృపుతెచ్చినశవంబు నిలువఁబెట్టి
యాభిక్షుకుండు దక్షిణాభిముఖుం డయి
మహనీయ యనుమంత్రమహిమఁ జేసి
వేతాళు నర్థి రావించి శవంబునం
దమర నిశ్చలమతి నావహించి
యరుణచందన కుసుమమాల్యముల నర్ఘ్య
ముఖ్యవిధులను బూజించి సౌఖ్య మొసఁగ
నధిప వేతాళపతికి సాష్టాంగవినతి
సేయు మిష్టార్థములు నిన్నుఁ జేరు నెందు. ౧౪౭

వ. అనవుడు. ౧౪౮

క. మ్రొక్కఁగొనఁ గాని యొరులకు
మ్రొక్క నెఱుఁగ నాకుఁజూపు మ్రొక్కెడితెఱఁగే
మ్రొక్కెద మఱి యనవుడు విధి
ద్రెక్కొన సాష్టాంగ మున్నతిం జేయుటయున్. ౧౪౯

క. భూరమణుఁడు సంభ్రమమున
దోరసిచే భిక్షుశిరము దునిమి సుభక్తిన్
బోరున వేతాళున కుప
హారము గావించి ప్రణతుఁడై లేచి వెసన్. ౧౫౦

క. ఆతపసి పేరురంబును
హేతిశితాగ్రమునఁ జీరి హృత్పద్మమునన్

వేతాళుని బూజించెను
నాతఁడు గడు వరదుఁడయ్యె నాసమయమునన్. ౧౫౧

వ. పితృవనివాసుం డైన పరమేశ్వరుండు సర్వదేవపరివృతుం
డై పుణ్యశ్లోకుం డగు నమ్మహీకాంతునకు సన్నిధిచేసి
యతనికి విద్యాధరచక్రవర్తిపదం బొసంగి యంతర్హితుం
డయ్యె నంతఁ బ్రభాతం బగుటయు మహేశ్వరప్రసాదంబున
విద్యాధరులు వచ్చి తోడ్కొనిపోవ విద్యాధరచక్రవర్తి
పదంబున నభిషిక్తుం డై నిజపురంబున నధిష్ఠించి యుభ
యరాజ్యసౌఖ్యంబుల ననుభవించుచుఁ బెంపొందె నక్కా
లంబునందు. ౧౫౨

మ. అహిలోకంబునఁ బన్నగేశ్వరసముద్యత్కాంతిఁ బోషిం
చుచున్, మహి మగ్గాబ్ధి హిమాగతారనగధామవ్రాతము
ల్విస్ఫురన్మహిమం గూర్చుచు నింగి తారకములం బా
లించుచు న్సర్వలోకహితుం డానరనాథుకీర్తి పరఁగెన్ గం
గాప్రవాహాకృతిన్. ౧౫౩

క. అనుచుఁ ద్రివిక్రమసేనుని
వినుతచరిత్రంబుఁ జెప్పి వేతాళుఁడు నా
కును వాహనముగఁ జేయుట
కనుకూలం బైన మంత్ర మది దయ నిచ్చెన్. ౧౫౪

వ. ఆమంత్రం బత్యంతనిష్ఠతో ననుష్ఠించి తత్ప్రభావంబున వే
తాళవాహనుండ నై వచ్చి దేవరం గాంచి ధన్యుండ నైతి
ననిన నక్కుమారకేసరి విక్రమకేసరి నభినుతించి రానిచెలుల
కెదురుచూచుచుఁ బూజ్యసామ్రాజ్యభోగంబు లనుభవిం
చుచు నొక్కనాఁడు. ౧౫౫

శా. ఆపస్తంబపవిత్రసూత్ర హరితఖ్యాతాన్వవాయామృతా
కూపారామరభూజ భక్తివినతక్ష్మానేశమానాయనీ
దీపారాధితపాదపీఠధరణీతేజఃప్రతిష్ఠాపన
వ్యాపారావతపట్నహాన్వకులమానాకల్పరత్నాంకురా.

క. మరకతమౌక్తికవిద్రుమ
కురువిందమహేంద్రనీలగోమేధక వి
స్ఫురితమణిశ్రీచిత్రభూషణ
పరితోషణసుకవిలోక భవ్యవివేకా ౧౫౭

ఉత్సాహ. బంధురప్రబంధబంధభవ్యనవ్యభాషణా
సింధుసమగభీరతావిశేషనిత్యభూషణా
సింధురాత్తప్రచురతురగసేవ్యవాజిశిక్షణా
బంధుమిత్రసుకవినికరపాలనావిచక్షణా. ౧౫౮

గద్యము. ఇది శ్రీమద్వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర హరి
తసగోత్ర పవిత్ర సుకవిజనమైత్రీ విధేయ అన్నయనామధే
యప్రణీతంబైన షోడశకుమారచరిత్రంబు నందుఁ బంచమా
శ్వాసము.

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## షష్ఠాశ్వాసము.



క. శ్రీహర్షముఖ్యసుకవిస
మాహితకావ్యప్రపంచమాధుర్యసుధా
గాహనలీలారసిక
వ్యాహారవిహార మంత్రియన్నయసూరా. ౧

సీ. దేదీప్యమానమై తేజరిల్లుచునున్న
మణిహేమమయసుధామండపమున
వివిధదేశాగతభువనాధినాథులు
బలసియిర్దిక్కులఁ గొలిచియుండ
జలజాయతాక్షులు చారుచామీకర
చమరవాలముల నందముగ నిడఁగ
నిందిందిరములకు విందులు గావించు
మాలతీకుసుమము ల్మౌళిఁ దనర
నాసుధర్మలో దేవత లర్థిఁ గొలువ
సమరకాంతలు వింజామరముల నిడఁగఁ
బారిజాతభూజాతపుష్పములు ముడిచి
యున్న యింద్రునిగతిఁ గొలువుండె విభుఁడు. ౨

వ. అయ్యవసరంబున. ౩

సీ. చిత్తజాజ్ఞాలక్ష్మి చేతి ప్రాసెలకట్టె
కరణి బెత్తము గేలఁ గరము మెఱయ
గనకకుంభములపైఁ గాయువెన్నెలవోలెఁ
జన్నులఁ జందనచర్చ దనరఁ
జపలాలతాసంగి శారదాభ్రమువోలెఁ
గట్టిన వలిపెపుఁబుట్ట మమరఁ
వదనేందునకుఁ బొంచి పొడసూపినరాహువోలెఁ
గచభాగమున ధమ్మిల్లంబు వ్రేల
రమణి యై యున్నశృంగారరసమువోలె
వచ్చెఁ గరజానువు లొంచి మ్రొక్కి
యల్లనల్లన యాప్రతీహారకాంత
వినయ మెసఁగంగ నిట్లని విన్నవించె. ౪

చ. పలికెడుఁ బెక్కుదేశముల భాషలు నచ్చుపడంగ సర్వవి
ద్యల విలసత్కవిత్వమునఁ దద్దయు మీఱెడు నెల్లవారు నిం
పుల విలసిల్లఁ బాడెడు నపూర్వముగా నొకచిల్క యొక్క
కో,మలి గొనితేర వచ్చెఁ గడిమంబున దేవరఁ గాంచువేడు
కన్. ౫

గీ. మాట లమృతరసముతేటలై పరఁగ వా
తెఱల కెంపు నింపు నెఱయఁ జేయఁ
జిలుకకంటె నొప్పు జలజాతలోచన
జలజనయనకంటెఁ జిలుక యొప్పు. ౬

వ. అనిన విని యమ్మహీపతి యత్యంతకౌతూహలంబున మం
త్రులం గనుంగొని. ౭

సీ. చిత్రజాజ్ఞాలక్ష్మి చేతి ప్రాసెలకట్టె
కరణి బెత్తము గేలఁ గరము మెఱయ
గనకకుంభములపైఁ గాయువెన్నెలలోలెఁ
జన్నులఁ జందనచర్చ దనరఁ
జపలాలతాసంగి శారదాభ్రములోలెఁ
గట్టిన వలిపపుఁ బుట్టమమర
వదనేందునకుఁ బొందు పొసఁగినరాహువోఁ
గటిభాగమున వేణిదండంబు వ్రేల
రమణియై యున్నశృంగారరసముఁబోలె
సన్నిధిఁ గరజానువు లొరయ మ్రొక్కి
యల్లనల్లన యాప్రతీహారకాంత
వినయ మెసఁగంగ నిట్లని విన్నవించె. ౪

చ. పలికెడుఁ బెక్కుదేశముల భాషలు నచ్చుపడంగ సర్వవి
ద్యల విలసత్కవిత్వమునఁ దద్దయు మీఱెడు నెల్లవారు నిం
పుల విలసిల్లఁ బాడెడు నపూర్వముగా నొకచిల్క యొక్క
కో,మలి గొనితేర వచ్చె గరిమంబున దేవరఁ గాంచువేడు
కన్. ౫

గీ. మాట లమృతరసముతేటలై పరఁగ వా
తెఱల కెంపు నింపు నెఱయఁ జేయఁ
జిలుకకంటె నొప్పు జలజాతలోచన
జలజనయనకంటెఁ జిలుక యొప్పు. ౬

వ. అనిన విని యమ్మహీపతి యత్యంతకౌతూహలంబున మం
త్రులం గనుంగొని. ౭

నేపురాణంబుల నేకథ యడిగినం
దడఁబాటు లేక యేర్పడఁగఁ జెప్పి
నోలి నవధానములు వేనవేలు సూపు
శబ్దవిజ్ఞాని నైనను సరకుగొనము
గౌతముని నైనఁ బోడిమి తర్కమున గెలుచు
నవధరింపు మీకీరంబు నవనినాథ. ౧౩

వ. అని పలికినయనంతరంబ మహారాజకీరంబు రాజు నవలోకించి.

ఉ. తామరచూలికెమ్మొగము దామరల న్మసనంచలేమ న
త్తామరపువ్వుకోడ లెలదామరయించుల బొమ్మకొమ్మ నె
త్తామరకన్నియు న్మఱియు తల్లి యొకప్పుడు నీతలంపుఁ గ్రొ
త్తామరలోన నెమ్మొగముదామర విప్పఁగ నుండుఁగావుత న్.

వ. అని యాశీర్వాదం బొనరించి ఋగ్యజుస్సామాథర్వణంబులయందును శిక్షాకల్పజ్యోతిషనిరుక్తవ్యాకరణచ్ఛందంబులందును మీమాంసాదు లగుతత్త్వబోధనంబులయందును బ్రాహ్మంబు శైవంబు పాద్మంబు వైష్ణవంబు భాగవతంబు భవిష్యత్తు నారదీయంబు మార్కండేయంబు నాగ్నేయంబు బ్రహ్మకైవర్తంబు లైంగంబు వారాహంబు స్కాందంబు వామనంబు గౌతమంబు గారుడంబు మాత్స్యంబు వాయవ్యంబు నను మహాపురాణములయందును, నారసింహంబు, నారదంబు, శివధర్మంబు, మాహేశ్వరంబు, గాలవంబు, మానవంబు, బ్రహ్మాండంబు, వారుణకాళికంబులు, సాంబంబు, సౌరంబు, మారీచంబు, కూర్మంబు, బ్రాహ్మభార్గవసౌరవైష్ణవంబులు నను నుపపురాణంబులయందును, సరసకవినిర్ణయంబు లగుకావ్యనాటకంబులయందును, సకలప్రసంగంబు

లయందు నుం దనకు నత్యంతపరిచయంబు గలుగుట చేతన
తిహృద్యవిద్యాగోష్ఠి నొనరించిన సకలజనంబులు సమ్ము
తానందకందళితమానసు లయి కనుంగొన రాజపుంగవుండు
రాజకీరంబు నవలోకించి. ౧౩

క. ఏపీటనుండి వచ్చితి
వేవిధమున నివృసేరి తీతేమకు నీ
కీ విద్యామాహాత్మ్యం
బేవిధమునఁ గలిగె నాకు నేర్పడఁ జెపుమా ౧౪

వ. అనుటయు. ౧౫

సీ. శ్రుతులు పుట్టినయిల్లు మతిజనంబులపంట
యాగమగోష్ఠి విహారదేశ
మష్టమహాసిద్ధు లందెడుకందువ
పరమయోగీంద్రుల పట్టుఁగొమ్మ
సిద్ధసారస్వతసిద్ధి కాపాలంబు
శబ్దశాస్త్రమునకు జన్మభూమి
నిశ్శ్రేయసంబుల నిచ్చిన మహనీయ
మహిమలగని శ్రీల మనికిపట్టు
గరుడ గంధర్వ కిన్నరఖచరసిద్ధ
పన్నగామరకోటుల బ్రదుకుఁజోటు
సర్వసర్వంసహావిభూషణ మనంగఁ
దనరె శారదాపీఠంబు మనుజనాథ ౧౬

క. అందుండు భారతి శతా
నందసదానందకారణవికాసముతో

బృందారకబృందార్చిత
మందారలతాంతసురభిమందిర యగుచున్. ౨౦

గీ. అమ్మహాదేవి లీలావనాంతరమున
బాల్యమున నేను విహరింపఁ బరమయోగి
యొక్కరుఁడు వచ్చి కదలకయుండ
... ... ... ౨౧

(శుక్రుడ గ్రంథపాతము)

ఉ. ... ... ... ...
... ... ... ...
... ... లనొల్లక నన్నుఁ గోరెడుం
గానలయుం దదా ప్రకృతిగాఁ దగునార్యఁ దలంచి చూడఁగన్

వ. అని నిశ్చయించి ధీరోదాత్తుండగుట సభాజనుల సన్నిధి
నడుగక యేకాంతంబున నడుగం దలంచి నానావిధభూషణ
చీనాంబరంబులు నతిమధుర రసవత్ఫలంబులు నొసంగి శుకం
బుతోడం గళావతిని వీడుపట్టున కనిచి సత్వరంబుగా మజ్జన
భోజనంబు లొనరించి యేకతంబున నుండి కళావతిని రావిం
చి యారాజశుకంబుతో ని ట్లనియె. ౨౩

క. శుకవర నీ చదివినయా
ర్యకు రెండర్థములు గలిగినట్లున్నవి చె
ప్పక మాకుఁ దెలియకున్నది
ప్రకటంబుగఁ జెప్పు దీని భావము దెలియన్. ౨౪

వ. అనవుడు శుకం బి ట్లనియె. ౨౫

క. త్రిదశాధిపుపురిపోలిక
విదిశాపురి యొప్పు మాళవీవిలసనసం

ఘన నై లింపవధూజన
ఘనమలవిలసనముతోడ ఘనమై యునికిన్. ౨౩

క. ఆసీను మేఘమాల
ద్రాస్వల్లభుఁ జేలు వతని గాదిలిసుత హం
సావళి గతినిర్జితహం
సావళి యున నొప్పు మిగుల ననసినాథా. ౨౪

సీ. కమలాక్షుచేపట్టు గలిగియు శంఖంబు
పూఁబోఁడికంఠంబుఁ బోలదయ్యె
నజునకుఁ బుట్టినిల్లయ్యును దామర
బాలికకనుదోయిఁ బోలదయ్యె
భవునాశ్రయించియుఁ బ్రాలేయకరరేఖ
లోలాక్షినిటలంబుఁ బోలదయ్యె
మదనుని గుణమయ్యు మధుకరమాలిక
పొలఁతికుంతలములఁ బోలదయ్యె
ననిన సర్వాంగవరవిలాసాభిరామ
యైన హంసావళికి నెనయైనసతులు
గలరె మనుజేంద్ర మూఁడులోకములయందు
నాలతాతన్వి తనుఁదాన పోలుఁగాని. ౨౫

గీ. చన్నదోయి చాల నున్నతిఁ జెలువొందెఁ
బెరుఁగుఁ గటియు దాన పిన్న నడుముఁ
బడఁతినడుము సిగ్గువడి డాఁగెనో నాఁగ
నారుమాటునంద యడఁగియుండు. ౨౬

సీ. నెలచందురునికాంతి నెమ్మోముసృజియించి
యకలంకవిలసనం బలవరించి

కలువరేకుల మించు కన్నులు గావించి
నిత్యవికాసంబు నెలవుకొలిపి
చక్రవాకవిభాతిఁ జన్నులు గల్పించి
పాయనివొప్పులు పరఁగఁజేసి
కరికుంభవిస్ఫూర్తిఁ గటిచక్రమొనరించి
కొమరారుననుజిగి గుదురుకొలిపి
వనజభవసృష్టి నిట్లు గైకొనక తాన
మీనకేతుండు వేడ్క నిర్మించెఁ గాక
మూఁడుజగములఁ గలుగు పూఁబోఁడులందు
మారె వేఱొకకన్యకఁ బోలఁగలదె. ౨౯

గీ. కాంతమెఱుఁగుఁజన్నుఁగవయును బోదలింపఁ
గుందెఁ గంటె కుంభికుంభయుగము
లేమి హాదుపునేయ నేమగునో యని
నడుము సన్నముగ నొనర్చె నజుఁడు. ౩౦

సీ. కరతలంబులవొప్పు సరసిజంబులఁ బోల
నెఱచందురుని బోలె నెమ్మొగంబు
తనువుటూర్పులయింపు గనుగాలి మించిన
నవరోమరేఖ పన్నగము మించె
నలకలు తేఁటుల చెలువంబు గెలువ నా
సికవొప్పు హేమపుష్పకము గెలిచె
ఘనకుచంబులు శైలగరిమంబు మీఱిన
రదనదీప్తులు వజ్రరశ్మి మీఱెఁ
గారణమ్ములేక కడుఁబరస్పరవైర
మయ్యె నొక్కొ మేనియందె యిప్పు

నవయావనముల కనుచు నతిచింత డస్సెనా
ననుము సన్న మయ్యె నలిననముఖికి. ౩౨

వ. అని మఱియు బహుప్రకారంబుల నయ్యంబుజవదనవిలసనం
బభినందించి యయ్యిందువదన న న్నెఱింగిన తెఱం గవధరిం
పు మని యి ట్లనియె. ౩౩

క. సిద్ధులచే నను బడసి న
మిద్ధగరిమఁ బొందెఁ గాన యీయింతి గడుఁ
శుద్ధమతి నెల్లనాఁడును
సిద్ధారాధనముఁ దగఁ బ్రసిద్ధిగఁ జేయున్. ౩౪

క. అదికారణంబుగా మా
సదనమునకు సిద్ధులెల్లఁ జనుదెంచుట నొ
క్కదినంబున సిద్ధుఁ డొకఁడు
సదమలతేజుండు వచ్చి సంభావితుఁడై. ౩౫

క. అనుపమవనితారూపం
బును మోహనపురుషరూపమును బాగుగ వ్రా
సినపట మాతనిహస్తం
బున నుండఁగఁ గాంచి వినయమున ని ట్లంటిన్. ౩౬

క. ఈవిధముల యొప్పిదములు
భూవలయములోనఁ గలుగఁబోలవు దేవా
యేవారి రూపులొకొ యివి
నావుడు ని ట్లనియె నాననము వికసిల్లన్. ౩౭

క. ఆకాశగతి యదృశ్యత
యాకర్షణవిద్య మాకు నలవడియుండుఁన్

లోకవిశేషంబు లద్ది
శ్యాకారత్వోకఁ జూచి యఖిలమునందున్. ౩౮

క. సకలజనమోహనాకృతి
నొకపురుషుని నొక్కచోట నుజ్జ్వలరూపా
ధిక నొక రమణీరత్నము
నొకచోటం జూచి యధికవిస్మయమునన్. ౩౯

క. నిను నీప్సులచేఁ బలుమఱు
వినియుండిన నీకుఁ జూపు వేడ్కనై త్రా
సినవాఁడఁ జూడు మని ప్రియ
మెనయంగా నాకుఁ జూపె యిట్లని పలికెన్. ౪౦

క. ఈరూపువాఁడు సోమకు
లారూఢుండు రాజమకుటహీరమణీవి
న్యాసరపాదాంభోజముహా
దారుఁడు కమలాకరాభిఖ్యాకుఁడు జగతిన్. ౪౧

క. ఈరూపుచెలువ మాళవ
భూరమణుని కన్య సకలభూభువనలస
న్నారీతిలక మనఁగఁ బెం
పారిన హంసావళీసమాహ్వయ చిలుకా. ౪౨

క. నిత్యముగా వారికి దాం
పత్యము సమకూరెనేని భావజకీర్తిదాం
పత్యము విస్తారమా దాం
పత్యమునం బోలె నెందుఁ బ్రస్తుతికెక్కున్. ౪౩

క. వలనిదమయంతిఁ గూర్చిన
కలహంసము వోలె నీవు గాంచెదు కీర్తుల్

చిలుకా పలుకులనేర్పులు
తొలఁకాడఁగఁ గూర్చు మిన్నుఁ ధూపములఁ దగన్. ౪౪

వ. అనిచెప్పి యప్పురోహితవరుండు నిజేచ్ఛం జరిగినఁ. ౪౫

క. మిమ్ము మహిపురఁ దగఁ గూర్పంగ
నెమ్మనమున వేడ్కనాకు నెగడుటయును నే
క్రొమ్మను దోడ్కొనిచన
నమ్మాళవరాజుపురికి నరిగితి మధిపా. ౪౬

సీ. హేలాసమాగతమాళవీలోచన
ద్విగుణీకృతోత్పలవిలసనంబు
నీరజమకరందనిష్యందవర్ధిత
వాఃపూరపూర్ణదుర్గాహామహిమ
సలిలసంగ్రహణార్థసంగికాదంబినీ
కాదంబకకదంబమేదురంబు
పానీయపానగతానేకఘోటక
ప్రతిభటోత్తుంగతరంగరాజి
యగుచు లోచనానందసమగ్రగరిమఁ
బరఁగు వేత్రవతీనది పరిఘ గాఁగ
ధారుణి సమస్తపురవరోత్తంస మగుచుఁ
దనరునవ్విదిశాపురి ధరణినాథ! ౪౭

వ. ఏ నప్పురంబు సొచ్చి యందలి యొప్పిదంబులు గన్నుల
పండువులు సేయుచుండ రాజమందిరంబున కరిగి. ౪౮

సీ. దౌవారికాలోకధవళమరీచులు
సవ్యపతాకికతోరణములు గాఁగ

ద్వారదారుస్థితగారుత్మతద్యుతి
లలితరంభాస్తంభకలన గాఁగ
దేహళీకలితసందీప్తవజ్రంబులు
రంగవల్లీజాలరచన గాఁగ
నుపరిభాగస్థాపితోజ్జ్వలరత్నముం
జలములు నవదర్పణములు గాఁగ
సహజశోభ నలంకారమహిమ మెఱయ
నంద మొందు తద్ద్వారంబునందు నిలిచి
ధారుణీశులు గొలువ నొప్పారుమాకు
వ్రసకు మారాక యెఱిఁగించి పుచ్చుటయును. ౭౯

వ. నూతనకౌతుకంబున మమ్ముం గానుపించుకొని బహుమానం
బొనరించి. ౮౦

క. దిన మెల్లను మాగోష్ఠిన
యనురాగరసాబ్ధినోలలాడుచు మాకుం
గనకాంబరమణిభూషణ
ఘనరసవత్ఫలము లిచ్చి గౌరవ మెసఁగన్. ౮౧

వ. సకలసంవిధానంబులు సేయించి మాకు నొక్కమణిహర్మ్యం
బు విడిదల నిచ్చిన నుండి మఱునాఁడు. ౮౨

సీ. హాటకరచితకవాటనానాశాలా
శోభితప్రతిహారసుందరంబు
మణికీలితవిటంకమానితస్తంభాగ్ర
గోపానసీసుప్రదీపితంబు
నవకీరతురగాదినవ్యమనోహర
బహురూపచిత్రవిభ్రాజితంబు

రత్నరాజితచిత్రరంగవల్లీజాల
రంగత్ప్రభాభాసిరంగతలము
సకలదిక్పాలచిత్రరూపాంచితంబు
సర్వలక్షణశోభితసమున్నతంబు
నై సహంసావళీకన్యయాట మంటి
కరగితిమి తద్విశేషంబు లపరిమితము. ౫౩

క. అమలమణికుట్టిమంబులఁ
దమనీడలు చూచి బోటితండం బనుచున్
రమణా మెయిఁ జేరుముగ్ధ
ప్రమదల నవ్వుదురు ప్రౌఢభామాజనముల్. ౫౪

గీ. చిత్రసరసులలో వ్రాసి చెలువు మిగులు
హంసబృందంబుఁ గనుఁగొని యర్థితోడఁ
బోటి రాయంచపదువులు వోవఁ జేర
నిక్కపుహంసలా యని నృపకుమార. ౫౫

వ. ఇట్లతిరమ్యం బయిన నాట్యభవనం బంతయుం గలయం గనుంగొని యం దొక్కరుచిరకుడ్యభాగంబున భవదీయమనోహరాకారం బచ్చుపడ వ్రాసి యచ్చోటు వాసి చని విడిదల నున్నంత హంసావళి యచ్చటికిం జని యచ్చిత్రరూపంబుం గనుంగొని యత్యంతమనోహరంబు లగుతద్విలాసంబులం దగిలి చూచి పచ్చవిలుతు బారిం బాఱి యే నారూపంబు లిఖియించుట యచ్చటిజనంబులవలన విని పరిచారికలచేతం దనపాలికి నన్నుం బిలిపించికొని సముచితసంభావనంబు లొనరించి భవద్రూపచిత్రరూపంబుఁ జూపి యిట్లనియె.

క. చిలుకా యుక్తివిలాసము
గలపురుషుఁడు జగమునందుఁ గలఁడో యీయా
జ్జ్వలరూపము నీకరకా
శలము మెఱయ వ్రాసితో నిజంబుగఁ జెపుమా. ౫౭

వ. అనిన నానేర్పువిధంబును దేవరయన్వయనామధేయవిలాస రాజ్యవైభవంబులు వినిపించి మనోభవాధీనమానసం గావించిన నతిప్రయత్నంబున నేపేరాంబరంబునందుం దాన యీయాకార్య లిఖియించి యిచ్చి నాకు వివిధవిశేషసంభావనంబు లొనరించి పుత్తెర నిచ్చుటికి వచ్చితి నని యాయాకార్యాక్షరపంక్తి మనోహరం బైనకళావతీకరస్థం బగునంబరం బవ్విభునిముందటం బెట్టి యవధరింపు మనిన వేడ్కలు సందడింపం గరంబు చాఁచి యందుకొని. ౫౮

క. పద్యము రెండర్థములను
హృద్యం బగుటకును వ్రాల యేర్పాటునకుం
జోద్యముఁ బొంది కరంగుచు
నుద్యత్పులకాంగుఁ డగుచు నున్నంత వెసన్. ౫౯

క. కీరత దొఱంగి యది గుణ
నీరధి యగుతమవివేకనిధి యై తనకుం
బోరునఁ బ్రణమిల్లుటయును
భూరమణుం డద్భుతంబుఁ బొందినమదితోన్. ౬౦

వ. దిగ్గన సింహాసనంబు డిగ్గి యిచ్చ యలరం గవుంగిలించుకొని తా నెప్పటియట్ల యాసీనుం డై యతని సముచితాసనంబున నునిచికొని యాక్షణంబ భీమభటాదు లగుమంత్రుల రావించిన వార లతనిం గని ప్రమోదమానసు లై పరిరంభ

ణంబు లాచరించి రయ్యెడ నుచితాసనంబుల నుండ ని
యమించి సకలవిద్యాధారం బగుకీరంబు వివేకనిధి యగుటం
జెప్పి యతని నవలోకించి నీ వింతతడవు శోకంబ నై యుండి
సహజాకారంబు దాల్చుటకుం గారణం బేమి యని యడి
గిన ముకుళితకరకమలుం డై యతం డిట్లనియె. ౬౨

గీ. ఉరగకోపంబుచేత నాతుం డితఁ బొంది
మిగుల దవ్వుగ నేగి కాశ్మీరభూమి
శారదపురంబునకుఁ గొంత చేరు వైన
కానలోఁ దప మొనరించు మహామునిఁ గాంచి. ౬౩

ఉ. ఆతఁడు మానసన్నియతుఁ డౌట యెఱుంగఁగలేనియట్టి కా
ర్యాతురవృత్తి నాసతుఁడ నై నగనేలికరాజు నాసఖి
వ్రాతము నెట్లు గాంతు మునివల్లభ యానతి యీఁగదే కృ
పా,న్వితత నంచు నెల్లడర వేమఱు మానక వేఁడఁ జొచ్చినన్.

వ. సమాధివైకల్యంబునకుఁ గోపంబు దీపించిన. ౬౪

క. బాలిశవృత్తిం బలుమఱుఁ
బ్రేలి నియమవిఘ్న మాచరించితి నాకున్
బాలశుకంబవు గమ్మని
చాలం గృపమాలి మౌని శాప మొసఁగినన్. ౬౫

చ. అమితభయంబు నందుచుఁ దదంఘ్రులకుం బ్రణమిల్లి కా
ర్యదా,హమున భవన్మహానియమ మాత్మ నెఱుంగక వేఁ
డికొంటిఁ గా,ని మదము నొంది కా దిదియ నిశ్చయ మి
త్తెఱఁ గీవు దివ్యబో,ధమునఁ దలంచి చూచి కృప దప్పక
నన్ను ననుగ్రహింపవే. ౬౬

చ. అనవుఁడు దివ్యదృష్టి ననఘాత్ముఁడిఁగా ననుఁ జూచి యత్తపో
ధనుఁడు కుమార! నాపలుకు దప్పదు బాలశుకంబ వైన ని
కనవరతంబు సత్ఫలము లాదటఁ బెట్టుచుఁ బెంప దిక్కుఁ గ
ల్గు నఖిలవిద్యలందు నధికుండవు కాదు ద్విమాసమాత్రలోన్

సీ. రాజకీరంబ వై యాజన్మసిద్ధ మెఱుం
గకయున్న నాయనుగ్రహమువలన
నెమ్మి మై నొకనాటి నిశఁ గాఢహేవంగ
ఘనరాజ్యమహిమలఁ దనరుచున్న
యీరాజుకడ కేఁగ యారాజు గారెము
మగువయొప్పులును బ్రేమంబుఁ జెప్పి
యాక్షణంబునన శుకాకృతిఁ బెడఁబాసి
యారూపు ధరియించి యధిపుతోడ
నర్థి నీచెలులఁ గని యత్యంతమహిమఁ
బరఁగు దని సుప్రసన్నతఁ బలికె నాతఁ
డంతనుండి యి క్షితి లో నతని నెఱుఁగ
నధిప మిముఁ గాంచి ధన్యుఁడ నైతి ననిన. ౭౦

వ. ఇచ్చ నచ్చెరు వందుచు నత్తఱి నత్తెఱంగునకుం జింతా
క్రాంత యై యున్న కళావతిం గనుంగొని నీవు నెమ్మనంబు
న నుమ్మలికంబు నొందకుము సర్వజ్ఞత్వంబున నీచిలుక య
గునట్టిచిలుకం గలిగించి నీ కిచ్చెద మని యూఱడించి చిత్ర
కరు నవలోకించిన నమ్మహాచతురుండు. ౭౧

క. వెలసిన సర్వజ్ఞతచేఁ
జెలువశుకముఁ బోలునట్టిచిలుకవు గమ్మం

చిల నొక్క శుకాకారముఁ
జెలువారఁగ నాత్మయష్టిచే వ్రాయుటయున్. ౭౦

క. అచ్చిలుక తాన క్రమ్మఱ
నచ్చుటఁ బొడసూపినట్టు లక్షిలజ్ఞతయుక్
మెచ్చులమాటలుఁ దొల్లిటి
యచ్చుగ నొకరాజకీర మచ్చుటఁ బొడమన్. ౭౧

క. ఆరాజశుకము వేడుక
నారాజాననకు నిచ్చి యద్భుతమోద
శ్రీరంజిల్లుట కలరుచు
నారాజవరేణ్యుఁ డభిమతార్థము లిచ్చెన్. ౭౨

వ. ఇచ్చి సముచితప్రకారంబుల పేఁకొలిపి హంసావళివలని కోరికలు గుఱి* కొలుపఁ దద్దిగ్విజయంబునెపంబున నప్పురంబునకుం జన నిశ్చయించి సకలదండనాథుల దండయాత్రకు నియమించి ప్రయాణభేరి వ్రేయించిన. ౭౩

సీ. ఉలికివాహములు లంకెలు వైచుకొనుటయు
నినుఁడు సారథికిఁ దో డెత్తఁగడఁగె
వననిధి పిండలివండుగాఁ గలఁగినఁ
బెనుఁగొంపి సౌర్వాగ్ని పొనుఁగుపడియె
మూర్ఛిల్లి ఫణికూర్మములు మీఁద వ్రాలిన
మొదలికక్రికి మెడ గుదియఁబడియె
మేదిని వడఁకిన మేదినీధరగండ
శైలంబు లందంద రాలఁదొడఁగె

* గొరికొలుప-మూ. బురికొలుప ?

దిక్కు లల్లాడె ధర గ్రుంగె దిగ్గజములు
అఖిలమును నిండి బ్రహ్మాండ మవియఁ జేయఁ
గనకకోణసంతాడితఘనతరప్ర
యాణభేరీమహారావ మడరుటయును. ౭౪

వ. ఇట్లు ప్రస్థానభేరీరవంబు చెలంగ సైన్యంబు నలుగడ నడవం దొడంగిన. ౭౫

సీ. ఘనరేణువులు గప్పి కనరానివానముల్
మంటిముద్దలు వోలె మింటఁ దనర
దట్టంపురజములఁ దారకంబులు గ్రుంగి
యవనిఁ బాంథనముత్రియములఁ బోల
మెలఁగ మిడుకరాక మేఘవర్గంబులు
దట్టంపుధూళిచేఁ దల్లడిల్లఁ
బాంసువు వానివినం బర్వతప్రకరంబు
దూబలబాగునఁ దోఁచుచుండ
దరువులెల్లను రూపేది చోడువు లయ్యె
నదులన్నియు బడితల గెడవు లయ్యె
మెట్టలన్నియుఁ జెడి కాలుమెట్టు లయ్యె
నరవరేణ్యుని సైన్యంబు నడచుటయును. ౭౬

## ప్రభాకరుని కథ

వ. ఇట్లతిభయంకరం బగు సైన్యంబు నడచి నడచి యొక్కయతి రమ్యస్థలంబున విడిదల గావించి మంత్రుల రావించి కొలు విచ్చి సముచితసల్లాపం బొనరించు సమయంబున గగనం బున నరిగి యరిగి యత్యుజ్జ్వలప్రభావిరాజమానం బగు వి మానం బొక్కటి యాకొలువుచక్కటిఁ గొంతతడవు నిలిచి

తదనంతరంబ తత్ప్రాంతంబున నవతరించినం గనుంగొని
డెందంబున నద్భుతంబు నొందిరి. ౭౭

తే. ఈవిమానంబు గలుగువాఁ డెవ్వఁ డనుచు
యేమికతమున వచ్చెనో యిప్డు డనుచు
సందడించు నవ్వేళ చూచునంతలోన
నవ్విమానంబు డిగి తేజ మతిశయిల్ల. ౭౮

క. తమచెలియైన ప్రభాకరుఁ
డమితానందంబుతోడ నరుదెంచిన భూ
రమణుండును మంత్రులు నెం
దమునఁ బ్రమోదంబు నద్భుతముఁ దనరారెన్. ౭౯

వ. సముద్ధితు లగునంత సంతసంబున నేతెంచి భూపాలునకుం
బ్రణామం బాచరించి యతని కౌఁగిలి వదలి క్రమంబున భీమ
భటాదులం బరిరంభణం బాచరించి యనంతరంబ సింహాస
నంబున నాసీనుండై కమలాకరుండు ప్రత్యేకంబు నందఱ
నిజాసనాసీనులం గావించి ప్రభాకరునకు సముచితాసనంబు
వెట్టించి యతనివదనంబునం జూడ్కి నిలిపి నీకు విమాన
యానం బెట్లు గలిగె నని యడిగినం గరంబులు మొగిడిచి.

క. భూనాథ మిమ్ముఁ గానక
దీనతఁ గాననములోనఁ దిరుగుచు నొకనా
మౌనీంద్రు నొకనిఁ గనుఁగొని
యానతి నొనరింప నాతఁ డాదర మెసఁగన్. ౮౦

క. తనదివ్యబోధమున నా
మనమువిధం బెల్ల నెఱిఁగి మది వగవకు మీ

జనపతిఁ గలసెదు నలువురు
వనితల వరియించి మహితవై భవనిధి వై. ౧౨

క. ధర వర్ధమానపురమునఁ
బరోపకారి యనఁగ ధరణీపాలుఁడు గలఁ డా
నరపతి తనసుత యెవ్వని
వరియింపక యున్న నాత్మ వగ గుందంగన్. ౧౩

సీ. నరులకు దూర మై పరువంపునెత్తావిఁ
గొమరు మీఱెడుపువ్వుగుత్తి వోలెఁ
బుడమి నెవ్వరికిఁ జేపడక యుజ్జ్వలభాతిఁ
జంబిన పెన్నిధానంబు వోలెఁ
గనకసంగతి లేక ఘనకాంతి నొప్పునం
దనహారుమహితరత్నంబు వోలె
జనులదృష్టికి నగోచర మయి కడవలో
వెలుఁగొందుఘనదీపకళిక వోలె
వరునిపొందు లేకున్నది వారిజాక్షి
యడవిఁ గాసినవెన్నెల యగునొ యింకఁ
దరుణిజవ్వన మనుచుఁ జింతాసముద్ర
మగ్నుఁ డై యున్నవాఁడు కుమారచంద్ర. ౧౪

క. ఆనెలఁతఁ గోరి తిరుగుచు
నానాయాసములఁ బొంది నలుగురువిలస
న్మానినులకుఁ బతి వై మీ
భూనాథునిఁ జెలులఁ గాంచు పొమ్మని పనుపన్. ౧౫

వ. ఆమునీంద్రునకు వినతుండ నై చని వర్ధమానపురంబుం జొచ్చుసమయంబున. ౧౬

క. కనకపురిఁ గనినవారికిఁ
దనపుత్త్రిక గగనలేఖఁ దగుఘనములతోఁ
మనుజేంద్రుం డొసఁగుదు నని
జను లెఱుఁగఁగ నగరవీథిఁ జాటఁ బనిచినన్. ౮౭

శా. ఏచందంబున నబ్బునో యకట యం చే నాత్మ నూహింపఁ
గా, నా చాటుపన్నిదము నాదుకర్ణముల కత్యానంద మొందిం
చిన, న్నావిచాలత్వ మెలర్ప హేమపురము న్వర్ణించి యేఁ
గంటి నం, చాచంద్రాస్య వరించువాఁడ నిది కార్యం బం
చు ధైర్యంబునన్. ౮౮

వ. సముచితాలంకారశోభితుండ నై రాజమందిరద్వారంబున
కరిగి ప్రతీహారపాలు నాలోకించి. ౮౯

క. కనకపురంబేఁ జూచితి
ననుటయు వాఁ డపుడు నన్ను నధిపతికడకుం
గొనిపోవ నాతఁ డుబ్బుచుఁ
దనపుత్త్రిక ప్రోల నిలిపెఁ దద్దయు వేడ్కన్. ౯౦

సీ. కామినీనీలాలకములఁ జిక్కినవేడ్క
బలిమి నేకరణిని బాపరాక
సతియుఱ్ఱుఁజన్నులసందుఁ దూఱినచూడ్కి
ధీరతఁ గదలించి తెలియరాక
పడఁతుకకౌఁదీవఁ దోడివడ్డభావంబు
నెట్టును నిలువంగఁబట్టరాక
భామినీగురునితంబంబు నెక్కినమది
నేచందమున దిగియింపరాక

బున నేదేశములోనిది
కనకపురము చెప్పవయ్య కరుణ ననుటయున్. ౯౭

సీ. కనకపురంబుఁ గన్గొనినవారును విన్న
  వారును గలుగ రీవసుధలోన
దనఫలో సుస్ఫుటం బనుదివియందు స
  త్యక్రముఁ గనియెడు దాశరాజు
గలఁ డతఁ డీధాత్రిఁ గలపట్టణంబుల
  నన్నియు నెఱుంగు వాఁ డున్న యెడకు
నరిగి యాపురము నీ వరుగంగఁ జెప్పెడుఁ
  బొమ్మన వినతితో నమ్మునీంద్రు
వీడుకొని బహుపర్వతవిపినరాష్ట్ర
పంక్తిఁ దఱియించి యొకకరపట్టణమున
నరిగి యాద్వీపమునకుఁ దా నరుగువారి
నెమ్మిఁ దడవంగ దైవయోగమ్మునందు. ౯౮

క. అనఘుఁడు సముద్రదత్తుం
డను వైశ్యుం డందుఁ జనఁగ నాయితపడు నా
తనిఁ గూడి యతఁడు నేనును
ననుఁగుల మై యోడ యెక్కి యరిగెడు వేళన్. ౯౯

క. శ్రీలలనాధీశ్వరు నఱ
కాలఁ దనరుతిలక మనఁగఁ గడు మెఱసి లస
న్నీలాభ్రఖండ మొక్కటి
యాలోనం బ్రబలె దుర్జనాపద వోలెన్. ౧౦౦

క. అంభోదపటలదర్శన
సంభవపవనోద్గవిపులజలపూరముచే

సంభోగ్యరమార్గం బగు
శంభోరుశిఖరిఁ గుండె నతిభయదం బై. ౧౧౧

సీ. చిత్రవర్ణవిచిత్రభ్రమవల్లులు
పరఁగెడుఘనజటాపంక్తి వోలయ
నంబుపానసమాగతాంబుదపటలంబు
దనరారుకంఠరాజనము గాఁగఁ
ప్రబలవాతోద్ధూతభూరిసంఘంబులు
విస్తరిల్లుమహాస్ఫటితతిఁ బోల
ఘోరతరస్ఫురద్ఘుమఘుమాఘోషణం
బారభటీభాతి నతిశయిల్లఁ
బ్రళయకాలతాండవలీలఁ బ్రజ్వరిల్లు
ఫాలలోచను నుగ్రరూపంబు వోలె
నంబరంబును దిక్కులు నాక్రమించి
యతిభయంకర మయ్యె నాయంబుదంబు. ౧౧౨

వ. ఆలో నమ్మహావాయువు తలక్రిందుగా ద్రోసిన. ౧౧౩

క. కలజను లందఱు నంతయుఁ
గలకలమున నార్తిఁ బొందఁ గల మవియంగాఁ
గలఁగక సముద్రదత్తుఁడు
పలక యొకటి వట్టి యీఁదెఁ బటుధైర్యమునన్. ౧౧౪

క. నను నప్పు డొక్కమీనము
గని మ్రింగుట నల్ల దాని ఘనతరకుక్షిం
దనువై కల్యము నొందక
యనపాయత నుండితిం జిరాయువు కలిమిన్. ౧౧౫

శా. నాపుణ్యంబున నొక్కబాలికి వలం దన్మాతృస్వప్నము బుట్టగ
న్యాపాదుం బొనరించి తన్నుం గని యత్యాశ్చర్యము బొం
ది య, త్మాపన్నత్వముతోన దన్నుమగఁ దా నర్థించి పే
ర్కొట్టు, ద్వీపం బున్న విధి మున్నతించి కనుం బ్రీతిం బొందు
నానందంబులోన్. ౧౦౬

క. యతిపతి చెప్పిన సత్య
వ్రతుఁ డనువృద్ధుకడ కేగి వానికి నేఁ జె
ప్పితి నాదగు వృత్తాంతం
బతఁ డెంతయుఁ జోద్యపడఁగ వాద్యంతంబున్. ౧౦౭

క. నామాటలు విని దాశ
గ్రామణి కనకాఖ్యపురము గల దిల ననఁగా
నేము వినము వినకున్నను
నే మగు విను మప్పురంబు నెఱుఁగుదెఱంగున్.

ఉ. దీవులవార లెల్లఁ జనుదెంతురు వారసి గాఁగ నెల్లి ల
క్ష్మీవిభుఁ గొల్వ నచ్చటికిఁ జేరువఁ బుష్కరనామసంజ్ఞ మ
ద్దీవికి హేమపట్టణము నిశ్చయ మద్ది యెఱుంగవచ్చు వే
డ్కవును నేను నచ్చటికి నేగుద మంచుఁ బరోపకారతన్. ౧౧౦

క. నను నాదీవికిఁ దోడ్కొని
వననిధినడుమ నరుగ నొక వటముసమీపం
బున నోడ దైవవశమున
ఘనమగుసుడిఁ బడిన నేను గంపింపంగన్.

గీ. చలన మొందక యవ్వటశాఖఁ బట్టి
వేగ మెక్కి కలము సుడి వెడలఁ దెచ్చి

నిన్ను నెక్కించుకొనియెద నన్ను నట్టి
యతిపయుండున నెక్కితి నక్కజంబు. ౧౧౧

క. సుజనాంబర వసి ముందఱ
వెడలింపఁగరాక దాశవిభుఁడు విచారిం(త్రై)
జలనిధిఁ గలంబులోనను
పాడవఁడైన నామమునను పురపురఁబోక్కున్. ౧౧౨

వ. ఆలోన లో నాత్రిం బొంది యిట్లంటిని. ౧౧౩

మ. చెలులం గానక కానలోఁ దిరుగఁగాఁ జేమాయల న్మాని
నుల్, వలలం బెట్టిన నిక్కవంబు లనుచు న్వాంఛారతి న్వ
చ్చి యా, వలువాటు ల్వడి వీనిఁ జేరి యితఁడుం బాపంబు
దైవంబుచేఁ, బొలియుంగా నిటు దిక్కుమాలుదునె యంభో
రాశిమధ్యంబునన్. ౧౧౪

క. తరుణుల వరించి కనియెద
ధరణీశ్వరు ననినయాస దైవము చెఱచెన్
మరణము శరణని యంతః
కరణంబున నిశ్చయింపఁగా నట్టియెడన్. ౧౧౫

వ. ఆక్రోశంబుదనర నాకాశవాణి యిట్లనియె యక్షుం డొక్క
రుండొక్క మహామునిశాపంబున నిచ్చట నీవృక్షంబై నిలిచె
నీవు దోలంగిపోయిన శాపమోక్షంబు నొందెడు నీవు మర
ణోద్యోగంబు మాని నేఁ డీతరువున వసియింపు మెల్లి కనక
పురంబుఁ గనియెద వనిన నద్భుతం బంది యదియుం జూచె
దఁగాక యని యున్నంతను. ౧౧౬

క. భూపాల నాఁటిరాత్రి మ
హాపక్షులు గొన్ని వచ్చి యందలిఘనశా

క్షాపంక్తి నంది యూర్చ
ర్వ్యాపాదసమున్నతోజ్జ్వలాకారమునన్. ౧౧౭

వ. అట్టులుండి యమ్మహావిహంగంబు లెల్ల రేపకడఁ గదలి కనక పురంబునకుం బోద మని తమలో మనుష్యభాషల సంభాషించిన సంతోషించి. ౧౧౮

క. అం దొక్కపక్షి యెక్కల
సం దల్లనఁ దూఱి నెమ్మి శయనించితి నేఁ
జెంది వసించుట యించుక
యుం దెలియకయుండె దాని కురుతనువగుటన్. ౧౧౯

క. వేవినఁ గద లెఱుఁగుచు నే
సేవికొని వసింపఁ బక్షు లెల్లను జనఁగా
నావిహగము చని కనకపు
రీవృక్షమునందు నిలువఁ బ్రియమెసలారన్. ౧౨౦

క. ఆప్పులుఁగు డేని యెక్కల
లోపల మెలపార వెడలి లోచనపర్వం
బై పూర్ణగరిమఁ దనరెడు
నాపురముం జొచ్చి వీథినరిగెడు వేళన్. ౧౨౧

క. మేడపయినుండి కనుఁగొని
వేడుక యొసలార నొక్కవెలఁది వనుపఁగాఁ
బ్రోడచెలి వచ్చి నన్నుం
దోడుకొనుచు నరిగె నవ్వధూమణికడకున్. ౧౨౨

వ. అప్పుడు. ౧౨౩

సీ. జిగిదొలఁకాడెడు చిగురాకుఁ గెమ్మోవి
పగడంపుఁదీఁగెల బాగుఁ దెగడ

నిమ్నాలుఁ గొప్పుల నెఱయు క్రొమ్మించులు
డోలుకాడు మెఱుఁగుల చెలువుగెలువఁ
కెమ్మోవి డాలంకెడు చిఱునవ్వు నెమ్మోము
నిండుఁజందురునకు నెఱసు చూప
సుసమించు పచరించు ఘనకుచయుగళంబు
కనకకుంభంబుల గారవింపఁ
బలుకనేర్చిన కనకంపుఁ బ్రతిమవోలె
రామయై యొప్పు శృంగారరసమువంగ
నఖిలమోహనమూర్తియై యతిశయిల్లు
నన్నలినగంధిఁ బొడగంటిఁ గన్నులలర. ౧౭౮

క. ననుఁ గనుఁగొని యయ్యంగన
యనురాగముఁ గౌతుకంబు నలవడ సంభా
వనము లొనరించి మదిలో
ననురాగము వెరయ నిట్టు లనియె న్నాతోన్. ౧౭౯

సీ. వీరచూడుఁ డనెడువిద్యాధరుఁడు గాంచె
వనితల నలువుర వారిలోన
నగ్రజఁ జంద్రప్రభాఖ్యమైఁ దనరుదు
నాతోడఁ బుట్టిననలినముఖులు
పద్మరేఖయు శశిప్రభయును సుప్రభ
యును ననువారల ముని శపింప
భూమిపై జనియించి పుట్టిజేంగినవారు
వారలఁ బాసినవగపుచేత
వనమునకు నేగెఁ దపసియై జనకుఁ డిప్పు
డేను జెలియంద్రరాకకు నెదురుచూచు

మున్ను దాన మనంబున నొండుతలంపు
మాని పోయెలతోడఁ గుమారచంద్ర. ౧౨౮

క. నరుఁ డొకనాఁ డాతుఁడ నై
నిరుపమవిలసనుఁడు వచ్చి నిన్నును నీతో
సరులను వరించు నని తాఁ
గరి యూనతి యిచ్చె నాకుఁ గరుణాదలిర్పన్. ౧౨౯

ఉ. అంబిక యూన తిచ్చినసమగ్రవిలాసివి నీవ కాఁగ డెం
దంబున నిశ్చయించి ప్రమదంబు వహించితి నిన్నరింతు నె
య్యంబునఁ గన్యకా జనకునాజ్ఞన నాథువరించు టెంతు న
ర్ఘ్యం బటు గాన తండ్రికిఁ బ్రియం బొనరించఁగఁ జెప్పివచ్చెదన్.

క. ఏ మఱిగి వచ్చుదాఁకను
నేమంబున నిచట నుండు నిశ్చలమతి వై
యీ మేడమీఁదినెలవుల*
కై మఱచియుఁ బోకు మనుచు నరిగెఁ జెలులతోన్.

వ. ఇంతి యరిగినయనంతరంబ ౧౩౦

క. ఈమీఁదినెలవు చూడకు
మీ మఱచియు ననుచుఁ జెప్పి మొలఁతుక చనె నం
దేమేమి యుండునో యని
యామీఁదటినెలవు కేఁగి యానీమమునన్. ౧౩౧

క. వరరత్నమయమునం గడుఁ
గర మొప్పెడుసజ్జలు మూఁడు గని యం దొకమం
దిరము కవాటంబు దెఱచి
పరికింపఁగ లోన నొక్కపర్యంకమునన్. ౧౩౨

---

*నిలువుల- అని కలదు.

వ. మునుఁ జూచినరూపంబుఁ గనుంగొని తదావరణంబు దొలఁ
గించిన. ౧౩౩

సీ. గవిసన వ్రచ్చిన నవకాంతి సొప్పారు
వలరాజుకోదండవల్లి యనఁగఁ
జేటిక దెఱచిన బెడఁగు మీఱుచు నున్న
పూవిల్తురత్నంపుబొమ్మ యనఁగ
నోఱ వాప నందంద మెఱుఁగులు చల్లెడు
పుష్పబాణునిఖడ్గపుత్రి యనఁగ
నలుక నిడ్డమునుంగు దొలఁగఁబుచ్చిన నొప్పు
భావజుపట్టపుదేవి* యనఁగ
మెఱసి వెడలంగ వెలుఁగొందుమెఱుపు వోలె
మునుఁగు వ్రచ్చినఁ దనుదీప్తి మునుఁగువడఁగఁ
జూడఁ గన్నులపండువై సొబగు మిగులు
కామినీమణిరూపంబు గాన నయ్యె. ౧౩౪

క. ఆరూపు చూచి మదనవి
కారము మదిఁ దనర నిద్రగదిరినయది యి
న్నారీమణి నిద్ర దెలిసి
యారయఁగ సుఖాబ్ధి నోల లాడెద ననుచున్. ౧౩౫

గీ. తెలిసి తెలిసి యెట్లుఁ దెలియకయుండిన
నిద్ర గాదు దీర్ఘనిద్ర యనుచు
నట్టు నిట్టు నిట్టియసమానవిలసనం
బేల గలుగు ననుచుఁ జాల బ్రమసి. ౧౩౬

* పట్టపుదేవి- మూ.

వ. కొంతతడవునకు మందంబునం దెలివి నొంది యూర్పు లరసి
సజీవం బని నిశ్చయించి యాశ్చర్యంబు నొంది. ౧౩౭

క. చైతన్యము లే కుండియు
జిత్తరముం జెన్ను గలిగె నింతితనువుం
జైతన్యము గలిగిన ని
న్నాతిచెలువు వొగడ వశమె నలువకు నైనన్. ౧౩౮

వ. అని యొప్పటియట్ల చేల గప్పి తొలంగి వచ్చి యాసంగడి
నున్నవాండ్రందఱుం బ్రవేశించి ముందటిచందంబు చూపు గ
నుంగొని మునుంగు వచ్చిన. ౧౩౯

క. పంచత్వప్రాప్తిఁ గనుపట్టి న
దంచితకాంతిని సముజ్జ్వలాకృతితోడన్
సంచారభేదమున ని
ద్రించినశారదశశాంకరేఖయుఁ బోలెన్. ౧౪౦

క. తొంగలిఱెప్పలమెఱుఁగులు
తొంగలిగొనుమేను వదనతోయరుహంబున్
శృంగారనిద్రఁ గూరె ల
తాంగి యనుచుఁ దలఁచి చాల ననురక్తి మెయిన్. ౧౪౧

వ. తెలిపి యెట్లునుం దెలియకున్న మున్నింటియింతిచందం బ
గుట యెఱింగి నివ్వెఱఁ గందుచు. ౧౪౨

క. అత్తరుణి రూపురేఖయుఁ
జిత్తమునకుఁ జాల వేడ్క సేయఁగఁ దోఁచెం
జిత్తరువుచందమునను
బుత్తడిరూపుగతి రత్నపుత్రికపోల్కిన్. ౧౪౩

వ. అని యచ్చెలువచెలువు వుగ్గడించి. ౧౪౪

క. అనిలితో మనసుఁ గీడి చని
దానవిమందిరముఁ జొచ్చి యందును నొకవ
స్త్రీమృతిహాసము పొడగని
దానవరణము వృచ్చి చూడ నాశ్చర్యముగన్. ౧౭౫

వ. పరోపకారిభూపాలనందనహాసం బగుటయు నాపోవక కనుం
గొని విస్మయంబుఁ బొంది యరసి మున్ను పొడగన్న య
న్నాతులయట్ల యగుటం దెలిసి యుల్లంబు జల్లన మూర్ఛిల్లి
యొంతయుం దడవునకుం గొంత తెలివిం బొంది. ౧౭౬

శా. ఓనామాక్షి సముద్రముం గడచి యెట్లేతెంచెనో వచ్చుఁ
బో, చావంగాఁ గత మేమి ఖేచరజనస్థానంబునన్ దీనికై
చావు నొన్నవును నొందుపాటువడి బల్వందంబులం జేరితిన్
దైవంబా యిటు లేలచేసితివి తంత్రంబో మరుంజంత్రమో.*

వ. అని దైవంబు దూఱి యవ్వామనయన నుద్దేశించి. ౧౭౮

సీ. తరుణి నీకుచపర్వతము లెక్కఁగాఁ గోరి
దారుణోన్నతపర్వతంబు లెక్కి
మగువ నీముఖచంద్రమండలాకృతిఁ జూడఁ
దమకించి బహుమండలములు చూచి
యంగన నిన్ను రాగాబ్ధి ముంపఁ దలంచి
యతిదుష్కరం బైనయబ్ధి మునిఁగి
జలజాక్షి నినుఁ జూపువలఁ దగుల్పఁగఁ బూని
వలుపాటు లను విధివలలఁ దగిలి
కనకపురము గాంచి కడుఁ బ్రమోదము నొంది
నిన్నుఁ జూతు ననుచు నున్నచోట

*చేశితివి నితంత్రంబ్యామరుంజంత్రమో- మూ.

నేల నచ్చి తీవటు కేల ఝూడరో నొంది
తేల నచ్చు నొంచె దిండుపపక. ౧౭౯

వ. అని విలాపించుచు మదనతాపంబునం గాఁగొనచేఁ గాఫో
పరిభాగంబునం జరియించుచున్నంత. ౧౮౦

క. క్షితినాథ మాయతురగం
బతిరయమున మేఘమీఁది కెగదెంచి సము
న్నతభూరమునఁ బన్నిన న
ద్భుతముగ నావర్ధమానపురమునఁ బడియెన్. ౧౮౧

క. పడి మూర్ఛ నొంది యెంతయుఁ
దడవునకుం దెలివి నొంది తత్పుర మగుచే
న్పడ నెఱిఁగి నాదుపాటులు
గడువ మ్మగుటకును దగవఁగా నవ్వోశెన్. ౧౮౨

క. కనకపురిఁ గనినవారికిఁ
దనపుత్త్రికఁ గనకరేఖఁ దగుధనములతో
మనుజేంద్రుఁ డొసంగెదు నని
జను లెఱుఁగఁగ నగరవీథిఁ జాటం గంటిన్. ౧౮౩

క. ఆచాటు విని కనకపురి
చూచినరూపంబు రాజసుతగా దనుచు
న్నాచిత్తము కలఁక యుడుగ
వేచని తోఁటిగతిఁ బతికి వినిపించుటయున్. ౧౮౪

క. ఆనరపతిపుత్త్రికయును
దానును నొక్కెడన యుండి తగఁ బిలిపింపం
గా నరిగిననను గనుఁగొని
యానెలఁతుక తోఁటిధూర్త యని పలుకుటయున్. ౧౮౫

సీ. నాఁ డెఱుంగం గాని నేఁ డెఱింగితిఁ జెలి
యత్యాగమ్యం బై నయప్పురమున
కరిఁ జంద్రప్రభ యనుకాంతఁ జూడఁగంటి
నది తనసోదరు లైనసతులు
మునిశాపమున మర్త్యమును బొందిరని చెప్పి
ననువరించెద నని జనకుకడకు
నరిగిన నేను సౌధాగ్రంబునకు నేగి
మూఁడుతల్పంబుల మూఁడుయువతి
రూపములఁ గంటి నం దొక్కరూపు నేఁడు
రూప మై యున్న వెఱఁగంద నేపు మిగిలి
తురగ మొక్కటి నిన్నుఁ జేరఁ గొరిజఁ జిమ్మఁ
బడితి నిప్పుడిలోపలఁ బద్మనయన. ౧౪౬

వ. అనినమాటలు విని యాక్షణంబ యమ్మానిని విగతజీవ యైన నాశ్చర్యంబునొంది యంతన తెలి వొంది యాకనక పురిసౌధాగ్రంబునం గనినమానినీరూపంబులు మూఁడును దత్సోదరుల నైజరూపంబులు గానోపు నందు మూఁడవ రూపం బీయింతిది, దీనిజీవం బచ్చటి కరిగినది నాకు నిచ్చటుం డడయం బని లే దన్నలువుర వరియింపక కమలాకరమహీవరదర్శనంబును సమకూరదు గాన మున్ను చనినమార్గంబునం జనియెదం దత్తరుణీవరణంబు దైవనిర్మితం బగుట నాకు నవశ్యంబును హేమపురదర్శనంబు సిద్ధించు ననుచు నిశ్చయించి వెడలి మున్ను చనినసముద్రతీరంబున కరిగి యచ్చట.

క. జలనిధిలోపల నాఁ డట
కల మవిసిన బ్రదికి వచ్చి కడఁ జేరిన యా

చెలికాని వైశ్యునిం గని
యలరుచు నాక్రమమునుఁ జెప్ప నాతఁడు ప్రీతిన్. ౧౫౯

ఉ. వన్నెకమోసఁ బెట్టి జతనంబుగ వారిధిలోనఁ బంచినన్
మున్నిటి దాశనాథునికి మూఢవు లున్నఁడ కేగ మేను ముక్
జన్నవిధంబుఁ దజ్జనకుఁడన్న తెఱంగును జెప్ప నయ్యెని
వన్నవధించి వచ్చి తని పల్కుచు నెంతయుఁ బాపబుద్ధి యై.

క. చండికి బలిసేయుద మని
చండతఁ బాదములఁ బెట్టసంకెల యిడినన్
బెండువడి వారిగ్రహమున
నుండఁగ నవ్వేళ దైవయోగము కతనన్. ౧౬౦

ఉ. అన్నవకౌను మించుపోలఁ గాంచెఁ దమేను వల్లనన్నలుం
జెన్నుమొగంబునుం గురులుఁ జిత్తజుతూపులఁ బోలుచూపు
లున్, నన్నలరింప నిండుమతినాఁ జను దాశనరేంద్రుపుత్రి
నా, యున్ననికేతనంబునకు నొక్కతెయుం జనుదెంచి వే
డుకన్. ౧౬౧

చ. జలజదళంబులం బఱచి చంద్రమకీచుల గేలిసేయుచుం,
గలువలమొప్పులం దెగడి కారుమెఱుంగుల మించి కాముని
మ్ములచెలువంబు గీడ్వఱచి ముత్తెపుజల్లులఁ బోలఁ జాలు
చూ, పుల నరుఁ గప్పి నామది నపూర్వసుతూహల మాన
హిల్లఁగన్. ౧౬౨

గీ. దాశరాజపుత్రి యద్దయు వేడ్కతోఁ
జెలువ మడరుచూపువలలు విచ్చి
యవి(గ)బ్బులగుట నపుడ నాకన్నులం
గలుగఁ జేసెఁ దనదుకులవిధంబు. ౧౬౩

వ. అట్లు నన్నుం బరికించి తనమనంబున మిగుల దిగు లొందె.

క. పన్నగకూటమిఁ జన్నన
గన్నంబున నప్పుడ నాభిగళ మహాస్తి గృహం
బన్నుత్తు లెఱుంగఁగఁ గాం
భన్నిభవాహమున నన్నుఁ బగవరియించెన్. ౧౬౫

శా. అతిలోకాతీతోద్దీప్తిలఁ బ్రియం బారంగ నం దుండఁగా
బాలేందుం గలయంధకారముగతిం బ్రద్యోతిదంష్ట్రాంకిత
త్రోటిలం బొక్కటి వచ్చి తత్పరమునం గోలాహలోదగ్రతం
గ్రాలంగాఁ గని విల్లు గైకొని భుజాగర్వం బఖర్వంబుగన్.

చ. చని కూడముట్టి యుజ్జ్వల
ఘనశరమున నెఱను నొవ్వఁగా నేయుటయుం
దను కొంది పంది యతలం
బున గొందికి నరిగె నొక్క భూవివరమునన్. ౧౬౬

క. వెంటనె యతలమునకుఁ జని
యంటఁ దజీమి జమునిపాలి కనిచి యచట నేఁ
గంటిఁ గొలనిదరి వాలుం
గంటి నొకతె నొంటి మెలఁగఁగా నచ్చోటన్. ౧౬౭

ఉ. అన్నగవోమునుం జిగియు నా తెలిగన్నులక్రొమ్మెఱుంగు
లా, పెన్నెఱి వేణినీలరుచి పెంపును నాభిగిచన్నుదోయియ
త్యున్నతిసొంపు నామృదుతనూజ్జ్వలకాంతియుఁ గాంతలందు
ము, న్నెన్నఁడుఁ జూడ నేను జరియించినభూములలోన
భూవరా. ౧౬౮

వ. అమ్మోహనాకారం జేరం జనుటయు నది యి ట్లనియె.

క. ధరణీశ్వరనందన నే
నురరిపుచేఁ బడితి నాఁడు సూకరమై ని
శితమున నిహతిం బొందెను
వరియింపుము నన్ను నరిన వారనికేళ్ళన్. ౧౭౧

క. అనుపమ మగునాతో యాళి
మనసిజభోగములఁ దేల్చి మచ్చికతో నిం
పెనయఁగ నావృత్తాంతము
వినిపించుట యుంప్రమోదవికసితముఖివై. ౧౭౨

సీ. కనకరేఖయు దాశకన్యయు నేను జం
ద్రప్రభాంగన సోదరుల మేము
మునిశాపవశమున మువ్వురమును మర్త్య
జనిఁ బొందినారము గనకపురముఁ
జూచినమనుజునిం జూచినఁ గనకరే
ఖకుఁ దొంటి శాపమోక్షంబు గలుగు
వానిఁబొందఁగ దాశవరతనూజకు నాకు
మనుజజన్మము మానుననియుఁ గలదు
కనకరేఖయుఁ దనమూర్తి గలసె నిన్నుఁ
బొందెఁగావున నటుచను నిందుమతియు*
నేనుసరిగెద మాతొంటిమేని కేము
పొందఁగలమింక నిను హేమపురము నందు. ౧౭౩

క. ఏ నీమేను దొఱఁగిచనఁ
గా నీవును వీక వెడలు గవ్వార మాలో

---

* ఇందుమతి బిందుమతి యను రెండురూపములుం గలవు.

నా నిజదేహము నొంది వి
మానముఁ బుత్తేర రమ్ము మాపురమునకున్. ౧౭౪

వ. అని పలికి యాక్షణంబ మే నసలజ్వాలలం దొఱంగి యప్స
రోటయును నావచ్చిన మార్గంబున వెలువడి విమానంబున
కెదురుచూచుచున్నంత. ౧౭౫

క. రాజితమణిస్ఫూర్తి లెసఁగ
బ్రాజమరాళములు పూనిన విమానంబుం
దేజోనిధి యొకఁడు ఖచర
రాజాజ్ఞం దెచ్చుటయును బ్రమదం బెసఁగన్. ౧౭౬

క. ఆవరయానము నెక్కి న
భోవీథిని వేగఁ గనకపురమున కరుగం
గా వీరమూర్తుఁడు బహుసం
భావనము లొనర్చి యపుడు భావం బలరన్. ౧౭౭

క. శ్రీ నెఱయఁగఁ దనకన్యల
నానలువుర నోలిఁ బరిణయము చేసి లస
చ్చీనాంబరమణిభూషణ
నానావిధవస్తు లిచ్చినం బ్రమదమునన్. ౧౭౮

వ. అలీలావతులతోడియభీష్టలీలల విహరించి మిమ్ముఁ గాంచు
తెఱం గూహించి. ౧౭౯

ఉ. మానినుల న్వరించి మఱి మానవనాథునిఁ గాంచె దంచు
నా, కానతి యిచ్చె మౌని తడయం బనిలేదు విమాన మె
క్కి యం,భోనిధిమీఁదుగా నరిగి భూస్థలి చూడఁగ నెవ్వి
ధంబునం, గానఁగ నయ్యె నం చరసి గ్రక్కున నేగెద నక్ష
దలంపునన్. ౧౮౦

వ. వచ్చి వచ్చి యిచ్చట దేవరం గాంచి కృతార్థుండ నైతి నని నందనుం బ్రమోదభరితుం జేసి పరమసంతసంబు. ౧౮౧

ఉ. భట్టియుగంధరాదివరపాలకమంత్రిమహాప్రవాహసం
ఘట్టనభీమురంధర విచారవిదూరవిలాసబంధురా
పట్టపటావళీకనకభద్రమదావళఘూర్ణఘోషణా
కట్టజవాజిరత్ననికరక్రమపూరితకాలకంధరా. ౧౮౨

క. శారదనీరదనారద
పారదహీరహారవాగ్భాస్వరితయశా
పూరఘనసారపూరిత
సారసగర్భాండభాండ సదవనశౌండా. ౧౮౩

మందారదామము. సంగీతసాహిత్యసారస్యలోలా
శృంగారలక్ష్మీవశీకారలీలా
అంగాధిపౌదార్యహారిప్రదానా
అంగీకృతశ్రీమదాదిప్రధానా. ౧౮౪

గద్యము. ఇది శ్రీమద్వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర హరితసగోత్ర పవిత్ర సుకవిజనమైత్రీ విధేయ అన్నయనామధేయప్రణీతంబైన షోడశకుమారచరిత్రంబు నందు షష్ఠాశ్వాసము.

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## సప్తమాశ్వాసము.

క. శ్రీభార్గవకామంపక
నైభావసమోపభార్యవాసవమంత్రి
ప్రాభవవిడంబధీగుణ
శోభితషాడ్గుణ్య యన్నసూరవరేణ్యా. ౧

చ. ఎదురుగ వచ్చి కాంచు ధరణీశుల రాజ్యము లిచ్చి నిల్పుచు
న్మదమున మాఱుకొన్ననృపమండలి నింద్రునిపీటి కంచుచుం
బదవులు మార్చి దుర్నృపుల బంధనశాలలఁ బెట్టఁ బంచుచు
న్విదితబలాఢ్యుఁ డానృపుఁడు విశ్రుతలీలల వాలుచున్నెడన్.

గీ. పుత్రవర్ధన మనియెడు పురము రాజు
గాన రాఁడు దేవర నతిగర్వి యనుచుఁ
జారు లెఱిఁగింప నధికరోషమునఁ గదలి
వీఁక జని యప్పురముమీఁద విడియుటయును. ౩

క. అరదంబు లెక్కి యిద్దఱుఁ
బురము వెడలి వీఁక వచ్చి భూమి యద్రువ ను
ద్ధురగతి నార్చుచు బలములఁ
బొదిగొనఁ దొడఁగుటయు విని విభుం డలుకమెయిన్. ౪

వ. అయ్యిరువురం బరాజితులం జేసి శక్తిత్రిం దని పంకజంబు ల
గుత్తమమంత్రులం బంపినం బరి ప్రాని వారు సన్నద్ధ త్రై
తేయులు దోడుకొని యూరూరులం జేర నరిగి మారిచి య
య్యిరువురను దమదృఢముష్టి యు దీర్ఘబాహుండును నై
నం బరమానందంబు నొందునంత నాభిముఖబాహులుం గని
యుల్లంబున నుల్లసిల్లి. ౫

—♦ దృఢముష్టిదీర్ఘబాహులకథ ♦—

క. నా యిరువురు సంభ్రమమునఁ
దేరులు డిగఁగా రథావతీర్ణు లయిన వే
వా రందఱు నమ్మంత్రులుఁ
జేరియుఁ బరిరంభణంబు చేసి ముదమునన్. ౬

వ. భూపాలుపాలికిం గొని చనిన నవ్విభుండు దవ్వులనే యామం
త్రులం గని యామోదంబున నెదురు చని తత్ప్రణామంబు
లాదరించి యెత్తి యిరువుర నొక్కకౌఁగిటం జేర్చి గౌరవిం
చి యుచితాసనంబుల నుండ నియోగించి సింహాసనాసీనుం
డై తదీయవదనంబులం జూడ్కి నిలిపి మీ రెచ్చటం జరి
యించి యిప్పురంబున కరుగుదెంచితి రని యడిగిన దీర్ఘబా
హుండు కరకమలంబులు మొగిడ్చి. ౭

గీ. వింధ్యమున నేను మి మ్మటు వెదకఁ బూని
పెక్కుభూములఁ జరియించి యొక్కనాఁడు
వరవిభవరమ్య మైనట్టిపురముఁ జొచ్చి
యం దొకమహీసురునియింటి కరుగుటయును. ౮

వ. ఆయింటి ముదుసలి శోకవ్యాకుల యై యుండి నన్ను నాలో
కించి. ౯

శా. ఓయమ్మా! జనుపిటికిం బయన మై యున్నాఁడు నాపట్టి
నా, కాయం బుద్ధురవేదన న్నిలువ దింక న్నాధనం బేల (పా
పే యంచుఁ) నెలుఁగెత్తి యేడ్చుటయు నిర్వేదంబునం
బొందె నే, నాయంబం గృపఁ జేరి కన్నుఁగవని రందంద
చే నొత్తుచున్. ౧౦

వ. తత్పుత్రమరణోద్యోగంబునకుం గారణం బేమి యని యడిగిన. ౧౧

సీ. ఈపిటికా జగద్దేవసేనతనూజ
దుష్టలబ్ధాఖ్య యద్భుతవిలాస
సంపూర్ణయౌవనోజ్జ్వల ఫురిఁ గలయట్టి
కొమరుల నిచ్చ యొక్కరునిగాఁగ
బలిమిమై నయ్యింతి పిలిపించికొను నందుఁ
బోయినవా రెల్లఁ బొలిసిపోవ
నింతకుమున్న యనేకులు చనిరి నా
వరతనూజాతునివరుస నేఁడు
దీని వల దని మాన్పంగ దిక్కు లేదు
నింతతోడ మాసంసార మెల్లఁ దీఱె
ననుచుఁ గ్రమ్మఱ నెలుఁగెత్తి యడలుటయును
నభయహస్తంబు నిచ్చి యి ట్లంటి నేను. ౧౨

క. నీకొడుకుఁ గాచి యీరే
యాకన్నియపాలి కేన యరిగెద నింకన్
శోకంబు మాని నెమ్మన
నాకులగతి నుండవమ్మ యని పలుకుటయున్. ౧౩

క. పెంపారి యిట్లు నదగునే
దేహము వడ నుడుగు సుతుండు దీర్చినరీ ము
న్మోహము న నిమ్ముఁ బంచిన
యూహాత్మ్య దొరంగు నయ్యె యుచ్చితభవములన్. ౧౩

ఉ. ఎవ్వరి నేమి చేసితినో యేను బోలిజాముల నాకమూరకం
డివ్విధిఁ బోయెడుం గాదుక యీజననంబున నింక నేరికిన్
నొవ్వి యెఱనప్ప నొడుదుఁ దనూజుని నై నిను సద్గుణాఢ్య
నే, నెవ్విధిఁ జావఁ బంతుం ధన మిచ్చెదఁ గైకొను మన్న
నావుడున్. ౧౪

క. లావును వెరవును గలుగుము
నేవిజయుండ నెల్లకడ నరేంద్రతనయచేఁ
జావక జయింపనోపుదు
నావాక్యము నెమ్మనమున నమ్ముము జనకా. ౧౫

వ. అని యూఱడం బలికి నాఁటి నిశాసమయంబున రాజకన్య
కాసదనంబున కరిగి రత్నదీపప్రభాశోభితం బైన తదంతరం
బున నాకాంత హంసతూలికాతల్పంబున నున్నంత. ౧౬

క. తొలుకారు మెఱుంగు కైవడిఁ
బులుకడిగిన మరునిశరము పోలికి నత్యు
జ్జ్వలరత్నపుత్రికాకృతిఁ
బొలఁతుక చనుదెంచె నెరసు పొంపిరివోవన్. ౧౭

వ. అయ్యంతిపురిలోన ఘోరాకారుం డగు నొక్కరక్కసుం డ
డుగుదెంచె నయ్యవసరంబున. ౧౮

చ. జలదము పొంతఁ గ్రొమ్మెఱుంగుచాడ్పున శైలముఁ జేరియు
న్న పుష్పలతికభంగి రాహుకడఁ జంద్రసముజ్జ్వల లక్ష్మి

పోల్కి నత్యున్నతఘనకుచకుంభభారంబులం జెలువారెడు నాసతిం
జూచి నానవోత్పల మొకటిచేకొని నాసికాగ్రముం గౌతుక
ముం దలిర్పంగన్. ౨౦

క. తప్పక చూచుచు నుండఁగ
నప్పొలఁతియు నన్నుఁ గాంచి యనురాగముతో
తెప్పయిడక కనుఁగొనఁగా
నప్పుడు నామీఁదఁ గడఁగె నసుర యలుకమై. ౨౧

క. సురవైరిఁ జూచి యేనును
గర మలుకఁ గరాసి నెత్తి కమలాకరభూ
వరుబంటు దీర్ఘబాహుండ
నుచితరముగ నన్నుఁ జూచె దోరనిశాటా. ౨౨

గీ. అనిన దైత్యుండు తనయాగ్రహంబు విడిచి
యీవు కమలాకరుని బంటవేని నేను
నీదుకూరిమిచెలిమామ నిన్ను వెదక
నరుగుదెంచితి ననినఁ బ్రియంబునొంది. ౨౩

క. ఏమిత్రుమామ ననుటయు
ధీమహితుం డైనయట్టి దృఢముష్టికి నే
మామ నని చెప్పుటయు నే
నామోదతరంగితాంతరంగుఁడ నగుచున్. ౨౪

వ. అతం డేమికతంబున నీకు నల్లుం డయ్యె నిప్పు డెచ్చట నున్న
వాఁడు చెప్పవయ్య యని యడిగినఁ దద్వృత్తాంతం బతని
చేత నేవిన్నదియు నేనుం గన్నదియును వివరించెద నాక
ర్ణింపుము. ౨౫

క. పంచోర్వ్యస్వమజన్మకమై
వింధ్యాటవి నతఁడు మిమ్ము వెదకి తిరుగుచున్
సంధ్యాసమయంబునఁ ద
ద్వింధ్యనిలయగృహము చేరి విధి కడలంతటన్. ౨౬

వ. విస్తారోదారం బైన యయ్యగారంబున నొక్కెడ నొక్కెడ నర్ధ
రాత్రసమయంబున. ౨౭

క. సాధకుఁ డొకఁడు డొక విం
బాధరఁ గొనివచ్చి యేమి యర్థించితియో య
మ్మాధవికి బలియొనర్పుట
కై ధృతితో కడలఁ బట్టి కత్తి దెగువ మై. ౨౮

క. కరవాల మెత్తుటయు మదిఁ
గరుణ వొడమ దానిఁ జూచి గ్రక్కున శౌర్యో
ద్ధురుఁడై బలువిడి నాతని
శిరము దునిమి దేవికి బలి చేసి వినతుఁడై. ౨౯

క. అవనితకట్టు లూడిచి
భావము వెఱ వాయఁ బలికి పద్మనయన నే
వేహానిసుతవు నిను వీఁ
డేవిధమునఁ దెచ్చె నాకు నెఱిఁగింపు మనన్. ౩౦

వ. భయసంభ్రమంబులు మనంబున ముప్పిరిగొన నప్పయోరు
హాలోచన నేను మాణిక్యపురాధీశ్వరుం డైన రత్నకేతుని
తనూభవను రత్నప్రభ యనుదానను నేఁటి సంధ్యాసమ
యంబున మహోత్సేధం బగు సౌధాగ్రతలంబున నిద్రింప
నిద్దురాత్ముండు నన్ను నెత్తికొనితెచ్చి యిచ్చట నిట్లొనర్ప
నిశ్చికొని యున్నవాఁ డింతలో నీవు నాపాలిభాగ్యదేవతవు

నోరి వచ్చి నా ప్రాణంబులు గాచితివి, నీయధీనంబ నైతి
నీచిత్తంబుకొలంది నడవంగలదాన నని విన్నవించిన నతండు.

క. నిను దోడుకొనుచుం జని నీ
జనకున కొప్పించి యిచ్చి జనియెద నని య
వ్వనజాయతలోచనం దో
డ్కొని తెలతెల వేగునంతకును బురి కరిగెన్. ౩౨

వ. అరిగి రాజమందిరద్వారంబున నిలిచి యాకాంత నంతఃపు
రంబులోపలికిం బనిచిన శోకవేగంబున బలవించుచున్న త
జ్జననీజనకులపాలికిం జని తన వృత్తాంతం బంతయు నెఱింగిం
చిన సంభ్రమించి. ౩౩

క. మనమున నత్యద్భుతమును
ఘనమోదము నుల్లసిల్లఁగా నప్పుడ యా
తని దోడితెచ్చి గౌరవ
మొనయఁగ నత్యాసనమున నిడికొని ప్రీతిన్. ౩౪

వ. తద్వృత్తాంతం బడిగి యతండు చెప్ప నంత యు నాకర్ణించి
కులపౌరుషంబుల నధికుంగా నెఱింగి యుల్లంబున నుల్లసిల్లి.

గీ. ప్రాణదానం బొసంగితి వట్టుగాన
నాసుతకు నీవ తగుప్రాణనాయకుండ
వఖిలగుణములయందు సత్యాధికుండు
వరుఁడు నీకంటెఁగలఁడె యీవనజముఖికి. ౩౫

వ. కావున నీరాజవదన వరియించి నారాజ్యలక్ష్మి కధ్యక్షుండ
వై యుండు మని యత్యంత ప్రియపూర్వకముగాఁ బ్రా
ర్థించిన. ౩౬

చ. సమయము గాదు నా కిపుడు శాశ్వతభోగము లంద మా
మహీరమణుని మిత్రవర్గము ధరాస్థలి నారసి కాంచి శి
ష్టులఁ, స్వామిచితవృత్తి నిమనకరంపరు బెంకిలి యై యశే
షభోగముల సుఖింతు నే ననినఁ గ్రమ్మఱ నాతఁడు వల్లె
వేయకన్. ౬౮

క. నానాదేశములకుఁ దగు
మానిసులం బనిచి సఖసమాజంబుకు మీ
మానవపతి వరయించెద
దీనత మైఁ గుందు నీకుఁ దెసఁగఁగనేలా. ౬౯

వ. అని సమ్మతంబుగాఁ బలికి పలికినయట్ల వెరవరు లగు భృత్యుల నానాదేశంబులకుం దరయం బనిచి యొక్కశుభలగ్నంబున నత్యంతవిభవంబునం దన కన్నియ వివాహం బొనరించి సకలసంపదలు నిచ్చిన నచ్చెలువతో నభిమతక్రీడావినోదంబులం దేలుచుండి యొక్కనాఁటి నిశాసమయంబునం దత్పురోపకంఠంబున నొక్క యార్తనాదంబు వీతెంచిన.

క. దృఢముష్టి వెడలె ఖడ్గము
దృఢముష్టి నమర్చి దానితెఱఁ గెఱుఁగుటకై
దృఢముగ బలవితరణపరి
వృఢుఁ డార్తులఁ గావ నెట్టివేళలఁ గడఁగున్. ౭౦

వ. ఇట్లు వెడలి చని యయ్యార్తనాదంబు చక్కటికి నరుగు
నప్పుడు. ౭౧

క. అలఘుతరదివ్యభూషలు
వెలుఁగంగా నోర్తు హృదయవేదన దోఁపం

బలుమాఱును నెలుఁగడరఁగఁ
బలవించుచు సతిఁ గని ప్రబలదైన్యమునన్. ౪౩

మ. వెలితే కోర్వవి వాడిమాటలకునై నేఁ డాలెకు ల్మత్పతిం
గొఱుఁతం బెట్టిరి తప్పిఁ దూలెముఁ గడుం గొబ్బందమిం జా
లఁ జ,త్తెఱము బొందెద నిజలం బోసఁగు చూడం బెద్ది
నాకంచుఁ బ్ర,ల్మెఱు దుఃఖించుచు వేఁడినం గరుణ యాత్మం
బర్వ ధైర్యంబునన్. ౪౪

సీ. నాభుజం బెక్కి నీప్రాణనాయకునకు
సీ కొసఁగు మంచు నాకొఱ్ఱుఁ జేర సరిగి
యాతఁ డెక్కించుకొన మెలపడర నెక్కి
మూఁపులందుఁ బదంబులు మోపి నిలిచి. ౪౫

గీ. కొఱతిపై నున్న చోరుని విఱచినమలఁ
బలలఖండంబు లిలమీఁదఁబడినఁ జూచి
వెఱక రక్కసిగా మదినెఱిఁగి యచటఁ
గదలిపోవక నిశ్చల హృదయుఁ డగుచు. ౪౬

చ. సురుచిరదివ్యరత్నపరిశోభితనూపురరమ్యమైన త
చ్చరణము నంటఁబట్టుటయుఁ జయ్యనఁ దానది యూడిపో
వుడుం, గరములఁ దత్పదాంగదము గ్రక్కునఁ జిక్కినఁ జూ
చి మెచ్చులం, బొరయుచు వేడ్కఁ బట్టుకొని పోయి నరేం
ద్రతనూజ కిచ్చినన్. ౪౭

క. మనుజులకు బ్రాఁతియగు న
య్యనుపమ భూషణముఁ జూచి యయ్యింతి ప్రియం
బున దీనితోడియందియ
యును దొరకొనుభాగ్యమబ్బునొకో నాకనినన్. ౪౮

స్వైరాతంకత నేను ద్రిమ్మరుటకుఁ డెందంబున నెమ్మెచ్చి సం
ప్రీతిం బొందితి వేఁడు మిప్పుడు మనోభీష్టంబుల న్నావుడున్.

తే. నిన్ను నొకయుండె చేకొంటె నిన్నెలవున
నాకు నీతోడియందియకై కడంగి
యరుగుదెంచితి నిచటి కయ్యుండె నాకు
నిచ్చట యభీష్ట మనవుడు నిచ్చ నలరి. ౫౬

క. వెనుకదెస నున్న దానవిఁ
గనుఁగొనుటయు నందెవ్వచ్చి క్రమ్మఱ నాకి
చ్చిన నేనాతనికిఁ బ్రియం
బెనయంగా నిచ్చి మైత్రి యొసకంబెసఁగన్. ౫౭

వ. ఏనడుగం దనబాల్యంబు మొదలుకొని నిన్నుఁ గన్నదితుది
గా నిజవృత్తాంతం బంతయు నెఱింగించిన నీచెలిమాటలకు
మోదించి మమ్ముఁ జూచి యరుగుదు గాని రమ్మని మ
త్పురంబునకుం దోడ్కొనిపోయి మదీయంబు లగుసకల సం
పద్విభవంబులుం జూపి వివిధసంభావనంబు లొనరించి.

చ. అవిరళకాంతికాంతనవయావనరూపవిలాసభాసురన్
యువతిలలామ నాతనయ నుత్సవమారఁగఁ బెండ్లి చేసిన
న్భవనమనోజ్ఞభోగములఁ బొందుచుఁ గొన్నిదినంబు లుండి
భూధవసుతపాలి కేగి ప్రమదంబున నందియ యిచ్చి మ
చ్చికన్. ౫౮

వ. అచ్చట నచ్చపలనయన నిష్టోపభోగంబులం దేల్చి క్రమ్మఱ
మత్పురంబున కరుదెంచి మిమ్ముం బొడగను నుపాయంబు
చింతింపుచుండ నొక్కనాఁడు శుక్రశిష్యుండు మహామతి య
నువిప్రుండు మాసదనంబున కరుగుదెంచిన నితండు త్రికాల

వేఁడి యని మోసం జెప్ప నిసఖుం డెఱింగి యతనికిం బ్రణా
మిల్లి మీ తెఱంగు గడిగిన నామహానుభావుండు నావదనం బవ
లోకించి. ౫౦

సీ. పుత్రవర్ధననామపురము నేలెడురాజు
తనకూఁతుఁ బరదేశమునకు నొసఁగఁ
జాలక యూసరోజాతలోచనఁ జూచి
యిష్టానికొమరుల నెల్ల నడుగ
నొకడు కరుదేర నియమంబు చేసెద
నందులో నీ మెచ్చునట్టివాని
హృదయేశుఁగా వరియింపుము నీ వని
నేఁడు చెప్పినవాఁడ నీ వచటికిఁ
దీవ్రగతి నేగి దాని కదృశ్యుఁడ వయి
రాత్రు లరుదెంచి తత్కుమారికల నోలి
ననుదినంబు నాహారంబు గొనుచు నుండు
మతనిచెలి యొకఁ డొక్కనాఁ డరుగుదెంచు. ౫౧

వ. ఆతండు కేవలపురుషుండు గాఁడు గావున నిభావంబుం గను
గొని పెరువాఁడి నిమీఁదం గవియునప్పుడు నివృత్తాంతంబుఁ
జెప్పి యిరువురం గూర్పుము నీవు గూర్చినవెనుకఁ గతిపయ
దినంబుల వీరుం దమరాజును జెలులం గలసెద రని పలికి ని
జేచ్ఛ నరిగె నతనివచనప్రకారంబున నిన్నుం బొడగాంచి
కృతార్థుండ నైతి నెల్లి నినచ్చెలి నిచ్చటికిం దోకొని వచ్చె
ద ననినం బరమానందభరితమానసుండ నై యాదనుజపుం
గవుం గవుంగిలించుకొని యతిశయంబునం దోడ్కొని క
మ్మని పనిచిన నతండును నతిత్వరితగతిం జని తద్వృత్తాం

తం బంతయు దృఢముష్టికిం జెప్పిన నద్భుతప్రమోదరసాయ
త్తచిత్తుండ నై యేకాంతంబున నానెచ్చెలివృత్తాంతం బంతయు
నెఱింగితి నని యతని వినుతించి వివిధవస్తువాహనంబులతో
నారక్కసుండు దోడ్కొనిపోవఁ బత్నీసమేతుండ నై పుత్రవ
ర్ధననామనగరంబునకు వచ్చి నన్నుం గాంచి యన్యోన్యస్నే
హపూర్వకంబుగా నాలింగనకుశలప్రశ్నాదివిధానంబు లా
చరించి దాని వరించి యభిమతక్రీడావినోదంబులసుఖం బను
భవించుచుఁ గొన్నినాళ్లుండు నంత. ౬౨

క. పుత్రకులు లేమి నపుడా
ధాత్రీపతి రాజ్యభరముఁ దమయుం దిడి స
న్మైత్రి దగ నునిచి పరమప
విత్రత వని కరిగి నియమవిధి వర్తిల్లెన్. ౬౩

వ. మేమును భవద్దర్శనంబు గోరుచు నిందుండ మాభాగ్యవశం
బున దేవరం బొడగని కృతార్థుల మైతి మని విన్నవించుట
యు నమ్మహీవల్లభుండు సంతసిల్లి వారల నుచితప్రకారంబున
సంభావించి హంసావళియందలి యనురాగంబునకు ననుగు
ణోద్యోగంబుగా దిగ్విజయయాత్ర నెపంబున విదిశాపురం
బున కరిగి తత్పురోద్యానంబున వేత్రవతీతీరంబున విడిసి మే
ఘమాలమహీపాలునకుం దమరాక యెఱింగించి పుత్తెంచిన.

గీ. అతఁడు సకలవస్తువితతులు కానుకగాఁ
గొనుచు నేగుదెంచి వినతుఁ డగుచు
నానృపాలుఁ గాంచి యత్యంతబహుమాన
లీలఁ జెంది మైత్రి గీలుకొనఁగ. ౬౪

వ. ఇష్టగోష్ఠీవినోదంబున నున్నయనంత రమ్మహీకాంతునకు సంతసం బొదవఁ దేజోవిభాకరుం డను బ్రభాకరుం డిట్లనియె.

క. చేతనయును సద్విజ్ఞా
నైతనయు నొసంగఁజాలు నీ నృపతికి నా
నాతతకౌతుక మొదవ మ
హీతలవర యనుఁడు నానవేళ్వరుఁ డంతన్. ౬౭

వ. సంతుష్టాంతరంగుండై యొంతయుం జెలి వొందు వినయంబునం గరకమలంబులు ముకుళించి యుచితప్రియపూర్వకంబుగా నమ్మహీవల్లభున కిట్లనియె. ౬౮

క. హంసావళిలో నెల్లను
హంసావళిఁ బోలు నిమ్మహాతేజమునన్
హంసావళికిని గనిజిత
హంసావళి నీవ తగినయధిపతి వధిపా. ౬౯

క. ఆకన్యారత్నంబును
నీకే తగు దిక్కులందు నిఖిలంబున సు
శ్లోకుండ వై వరింపు ప్ర
భాకరలగ్నమున నవ్వరానన నెమ్మిన్. ౭౦

వ. అని పలుకుటయుం బుడమిఱేనికొలువున నున్న వరాహా ర్యకు తెల్లింటివిశ్వాసమయంబున విశేషలగ్నంబు గల దని విన్నవించుటయు నుల్లసిల్లి మేఘమాలధరణీవల్లభుండు నత్తెఱంగున కియ్యకోని సముచితప్రకారంబున వివాహాని యుఱిగి యమ్మహోత్సవంబున కుత్సహించిన. ౭౧

క. తనరారెడు నవ్వార్తలు
విని హంసావళి కరంబు వేడుక నేఁ గో

దినకమలాకరుఁడో యు
ద్జనపతి వే పోకఁడో యనుచు సంశయ మడరన్. ౭౨

వ. తనచెలి యగుకమలమంజరి కేకతంబున నిట్లనియె. ౭౩

క. మనభూపతి కమలాకరుఁ
డనునృపతికి నన్ను నిత్తు ననినాఁడఁట యే
తనియున్న వేలమునకుం
జని తద్విధ మెల్లఁ దెలిసి చనుదె మ్మనినన్. ౭౪

సీ. తావులు వెదచల్లు పూవు లన్నియుఁ బుచ్చి
కచముల జడముడిగా నొనర్చి
కట్టిన వెలిపట్టుపుట్టంబు సడలించి
కరమొప్పు ప్రాఁతచెంగావి గట్టి
చందనమృగనాభిచర్చలు పోఁజేసి
మృదులనిర్మలభూతి మేన నలఁది
ధవళముక్తామయ తాటంకములు పుచ్చి
ప్రవిమలస్ఫటికము ల్చెవులఁ బూని
తొడవు లూడిచి రుద్రాక్షతొడువు వెట్టి
వరతపస్విని రమ్యభావంబుతోడ
నితరు లెవ్వరుఁ దా నని యెఱుఁగకుండ
నంబుజానన యన్నగరంబు వెడలి. ౭౫

వ. వేత్రవతీతీరంబున నత్యంతవిస్తారోదారం బగు కమలాకర స్కంధావారంబు దరియం జొచ్చి పేరోలగంబున సింహాసనాసీనుండును సేవాగతానేకభూవల్లభకిరీటరత్నదీపికావిరాజితపదారవిందుండును జామరగ్రాహిణీకరచామీకరచామ

రసాంచలాంచలితకాంతలుండను నై యొప్పారు సమ్మోహనవల్లి
భు నల్లనఁ జేరం జని. ౧౬

క. అగణితవిలాసుఁ డగు నా
జగతీపతిమూర్తి మానసంబున జూపుం
డగు లంగ నసంతరాజ్యం
బగుఁగాక యటంచు భూతి యల్లన నొసఁగెన్. ౧౭

సీ. భూతి యిచ్చినప్పుడు భూపాలనందను
కరసరోరుహమునఁ గరము గదియ
నెఱసి లోడ నేసె మెఱుఁగుబాణంబులు
క్షోత్రపుత్త్రురాలిఁ గుసుమశరుఁడు. ౧౮

క. చెలువ యిటు పుష్పసాయక
దళితహృదయ యయ్యెఁ దనవిదగ్ధతకతనం
బులకలుఁ జెమరుం గంపము
వెలయఁగ నిదయ్యె నప్పుడు పెంపెసలారన్. ౧౯

వ. అవ్విభుం డాభూతిఁబుచ్చుకొని సముచితాసీనంగావించి యె
చ్చటినుండివచ్చితివని యడిగిన నది క్రమ్మఱ దీవించి. ౨౦

క. ఏను బహుదేశచారిణి
నీనిఖిలముఁ దెలియ నాకు నిష్టం బగుటన్
శ్రీసిద్ధి నిను దర్శింపం
గా నరుదెంచితి ననిన గౌతుక మెసఁగన్. ౨౧

క. అనవుడు నాదరమున నా
జననాయకచంద్రుఁ డుచితసత్కారము లిం
పొనర నిడి వీడుకొల్పిన
మనసిజదందహ్యమానమానస యగుచున్. ౨౨

వ. చనుదెంచునప్పుడు దన యంతరంగంబున. ౮౩

ఉ. ఈసరసాక్షి శ్రీమహిమ యీయవికారత యీవిలాస మీ
వాసికి యీయుదారత ధరావరు లెవ్వరియందుఁ గల్గునే
యేసుకృతంబు చేసినమృగేక్షణ కబ్బునొ భూతలంబుపై
నీసొబగుండు నాథుఁడుగ నింపులఁ దేలెడు నిత్యధన్యతల్.

వ. అని యభినందించి యొక్కకపటోపాయంబుఁ జింతించి హం
సావళీకన్యకు నతనిమీఁద ననుచిప్పుట్టునట్లుగాఁ బలికి మా
యోపాయంబున నిన్నృభుని నేన వరియించెద రాత్రి లగ్నం
బగుట నా కవ్విధంబు సిద్ధించు నని నిశ్చయించి యబ్బాలి
కపాలికిం జని యేకతంబున ని ట్లనియె. ౮౫

క. కమలాక్షి భవన్మానస
కమలాకరమిత్రుఁ డైన కమలాకరభూ
రమణుండు గాఁడు దన్నా
మము వాఁ డీతండు రాజమర్కట మరయన్. ౮౬

గీ. వికృతవేషి మఱియు వృద్ధు క్రూరాత్ముండు
పాపకర్ముఁ డధికచాపలుండు
కుఱుచ తెవులుగొంటు పఱికగడ్డమువాఁడు
గదలఁ డేమిచెప్పఁ గమలవదన. ౮౭

క. కడవతల గొగ్గిపండ్లును
మిడిగ్రుడ్లులుఁ బల్లపల్లమీసంబులు దే
గడచెవులు గూనిమూఁపులు
బడగ బడుగు వానిఁ జెప్పఁ బనిలేదు చెలీ. ౮౮

శా. చెల్లంబో నిను వీని కీఁ దలఁచె లక్ష్మీహాని కోర్వంగ లే
కల్లం బన్నరనాథచంద్రునకు రాయో కాక నీ యట్టియు

త్తుల్లాంఛనమహనేత్రకు న్మగంబై యీమహాత్ముఁ డేమంచు
నో, తల్లి యాతనిఁ జూచి కంటె నాలికా దమ్యాంబా యను
స్మృతిచేసెన్. ౮౯

క. తనుమగనికి నీవుచిత్తము
ననుఁ దగఁ దనుమాత్రమైనఁ దను నొసఁగంగా
మగని ప్రీతి యైనఁ దోడనగుఁ
దగునే తగఁ కన్య నొసఁగ ధరణీశునకున్. ౯౦

క. గారా మైనదేవాభవ
నారక దూచెడుగుముడుక కొనఁగెదు నని యీ
యూశెల్లను వెలఁ బొందెదు
నీరాజున కేల బుద్ధి యిట్లయ్యెనొకో. ౯౧

గీ. ఏమి చేయుదాన నెక్కడఁ జొత్తు నే
నితనిఁ బొందు దిన్న నెట్లు చూతు
ననుచు మాయజంత యశ్రులు నించిన
నమ్మ సొమ్మసోయె నళినవదన. ౯౨

వ. ఇట్లు మూర్ఛ మునింగి హంసావళి యజ్జఉభి తన్నుఁ దెలుపఁ
దెలిసి యి ట్లనియె. ౯౩

ఉ. కామిని యట్టిరూపుఁ బొడగాంచినఁ బ్రాణము విడ్తు నప్డు
నా, కా మగఁ డేల యట్టి వికృతాకృతి కిచ్చెడు తండ్రి యే
ల నీ, వేమొయినైన రాత్రి నను నిచ్చటు వాపి మదీయవేష
ముఁ, శ్రీమెయిఁ దాల్చి యాతని వరింపఁగదే యని యక్తి
వేఁడినన్. ౯౪

క. తనతలఁచినట్ల యగుటకు
ననుమోదముఁ బొంది ప్రమద మానసపద్మం

బునఁ బోఁపఁగ నేటికి నిటు
నను వేఁడఁగ నీదుపను పూనచ్చెదఁ జెలియా. ౯౫

క. కూరిమిచెలికిం దానొక
పోరామికిఁ గానిబోటి బోటియె నినుఁ బె
వారికిఁ దప్పించి తగ
న్నీరూపముఁ దాల్చి యూశని వరింతు ధృతిన్. ౯౬

క. అనుటయును మాయ దెలియక
యనుకూలతగాఁ దలంచి హంసావళి చ
య్యనఁ దనచీరలుఁ దొడవులుఁ
దననెలవును దాని కిచ్చి తద్దయు భీతిన్. ౯౭

వ. నన్ను నెక్కడ దాఁచె దనుట యు సంధ్యాసమయానంతరంబ
యంధకారంబున నయ్యుత్పలగంధిం బురంబువెలికిం గొని
చని యొక్కపూఁదోఁటలోపల నత్యంతవిస్తారం బై తనరు
బూరువృక్షానికోటరంబున నునిచి వేగుజామునప్పు డాకమ
లాకరు వంచించి నీపాలికిం జనుదెంచెద వెఱవకుండు మని
యూఱడించె. ౯౮

సీ.........యక్షణాలంకృతం బైన
సముదీర్ణభద్రగజంబు నెక్కి
కుంజరాందోళికాఘోటకారూఢు లై
ప్రాణమిత్రులు తమ్ము బలసి కొలువఁ
బాఠకనికురుంబపఠనరవంబులు
గర్ణామృతంబు లై కరము మెఱయ
ముందట నెలకొన్న సందడిఁ దొలఁగించు
నురువేత్రహస్తులయుఱిది చెలఁగఁ

జాలకరదీపికాసహస్రములు వెలుఁగఁ
జెంద్రిక్రీడాగారమునఁ జాలఁ జెంపు నొంది
యఖిలకమలాకరుండు కమలాకరుండు
రమణ మీఱంగ విదిశాపురంబు సొచ్చె. ౯౯

వ. అయ్యవసరంబున. ౧౦౦

క. మదగజఘంటికములతో
మృదుపాఠకరవము చెలఁగ మే నలరంగా
నెదురుకొనియెఁ దనయల్లుని
విదిశాపురనాయకుండు విభవం బెసఁగన్. ౧౦౧

వ. ఇట్లెదురుకొని తోడ్కొని చని దైవయోగంబున హంసా
వళీభావంబు గలిగె కా దని యెఱుంగరాని కమలమంజరిని
మహావైభవంబున వివాహంబు గావించుటయు నాఁడె వి
శేషశుభదినం బగుట నశోకకళికతోడ నయ్యిందుమదనం
దోద్యానని కరదీపికాసహస్రంబులు ప్రజ్వరిల్లం గమలాకరుం
డు శిబిరంబున కరుగునప్పుడు కుంజరంబుమీఁద నన్నరేంద్ర
కుంజరువెనుక నున్న కృత్తికహంసావళి తాను రాజనందన
ననిచి వచ్చిన శాల్మలిపాదపంబుఁ గనుంగొని యుత్తరుని
తో నత్తరువు దహించునుపాయంబు బూహించి మొదలికి వ
డంకు దెచ్చుకొని వహ్నిం గాఁగిలించిన. ౧౦౨

క. మలఁగి కనుంగొని ధరణీ
తలవిభుఁ డిది యేమి యనినఁ దాఁ బలుకక క
న్నులు మోడ్చి యుండెఁ బలుమఱుఁ
దెలుపఁగ నొకకొంతవడికిఁ దెలిసినభంగిన్. ౧౦౩

వ. కన్ను లోకించుక తెఱచి యీరెలుంగున నతనికి వినవచ్చు
నట్లుగా ని ట్లనియె. ౧౦౪

మ. అలఘూజంబుననుండి దైత్యపతి యత్యాభీలభంగిన్ దృగం
చలముల్ నిప్పులవెల్లి గొల్ప ననుఁ దా జంకించినన్ భీతిమై
నులుకం గన్నులు మోడ్చి భ్రాంతమతి నై యున్నంత నా
మ్రోల నుజ్జ్వలవిప్రాకృతిఁ దోఁచి యి ట్లనియె వాత్సల్యం
బు దీపింపఁగన్. ౧౦౫

ఉ. ఇక్కుజ మగ్నిదేవునకు నిప్పుడ యాహుతి చేయఁ ద్రుంగు
నీ,రక్కసుఁ ద్రుంపకున్న నిది రాసుతుతో మననీదు నిన్ను
ని, వెక్కుడుభీతిమైఁ గలఁగ నేటికి నీపతిత్రోడ నింతయున్
స్రుక్కక చెప్పు మం చరిగె సోఁకును బాయఁ దొడంగె నం
తటన్. ౧౦౬

క. నావుడు నే నవ్విధమును
వేవే చేయింతు నీవు వెఱవకు మని దం
తావళము నిలుపఁ బంచి మ
హీవిభుఁ డయ్యెంతి మ్రోల నిడుకొని కడకన్. ౧౦౭

క. భటకోటిఁ జూచి మీ రీ
విటపిని దహియింపుఁ డనిన వెసఁ గాష్ఠము లో
క్కట మొదల నొంటి యం దు
త్కటముగ నలుదెసల నగ్ని దరికొల్పి రొగిన్. ౧౦౮

సీ. అంతకముంద యయ్యగకోటరంబున
నురగభయంబుచే నుండ నోడి
హంసావళి తొలంగి యత్తోఁటయం దొక్క
చో నొకపాదరింటిలోన నుండి

యున్నతేజము గాలి నడచు పెన్మంటలఁ
బగిలెంటిగతి దీప్తి వడఁగుటయు ను
బహుశలభకరదీపపంక్తులు వెలుఁగొంద
భద్రగజంబులపైఁ బ్రజ్వరిల్లఁ
గమలమంజరిబ్రోల క్షోణి వసింప
నతిమనోహరమూర్తిఁ జెందియున్న
చెలువుఁ గమలాకరుని గన్నులలరఁ జూచి
యచ్చెరువు రాగశోకంబు లాత్మఁ దనర. ౧౦౯

క. రాచిలుక ముక్కు వ్రాసిన
యూచిత్రము గజము మీఁది కపు డెంచిన యు
ల్లో చూపులపండువ యగు
నాచెలువుని చెలువ మాత్మ నలరింపంగన్. ౧౧౦

శా. ఈరా జారకరాజు చెప్పినతెఁ డా నీచెల్వ చెల్వంబుఁ గ
న్నారం గన్గొని కాముబారిఁ బడి మాయ ల్వన్ని సన్యాసి నే
ర్పారంగా వచియించె నన్నిటికి నాహారంబు గావించెఁ బెం
పార న్నాకొఱకై సుజంబు నిటు సేయం బంచెఁ బాపాత్ముఁడై.

సీ. ఈనరు మదిఁ గోరి యిచటి కేతెంచిన
నెవలోన ననుమాన మేల పుట్టె
వరునియున్నెడకు జవ్వనిఁ బంపఁ దగ దన
కేల పంపితి దీని నితనికడకు
నితని నింగించిన నిక్కవాఁడు నృపాలుఁ
డే యనుబుద్ధి నాకేల పుట్టె
హీనభావునకు నన్నీఁడని యెఱిఁగియు
నాతండ్రి మది నేల నమ్మనైతి

నిట్టిపాతకిఁ జెలిఁ జేసినట్టి బ్రహ్మ
యిన్నివిధములఁ దెలియంగ నేలయిచ్చు
నిన్నియును నేల యతఁడు ప్రాణేశ్వరుఁడుగ
నోము నే నోమఁగాక తొల్బ్యమునందు. ౧౧౨

క. ఈయింతి తలఁచినట్లుగ
నీయగ్నిం గాలనైతి నీభూజముతోఁ
గాయజువహ్నుల నిచ్చలు
నేయనువునఁ గాలుదాన నింకిట విధియా. ౧౧౩

వ. అనుచుఁ గన్నీరు వెల్లిగొన నన్నీరజనయన బహుప్రకారం
బులం బలవించుచుండె నంత నమ్మహామహీరుహంబు హు
తాశనుని కశనంబు చేసినదాన సంతుష్టహృదయ యైన య
య్యింతితో శిబిరంబున కరిగియున్నంత. ౧౧౪

క. కమలాకరుమై దైవకృ
తమునం బ్రబలజ్వరంబు దనుకొందుటఁ గృ
త్రిమహంసావళి తనచి
త్తమునం జింతింపఁ దొడఁగెఁ దద్దయు భీతిన్. ౧౧౫

గీ. శిరమునందు హంసావళి కరముపెట్ట
జ్వర మతిత్వరగతి మాను జనుల కనుచు
విన్నవాఁడిప్డు నన్ను నివ్విధముచేయఁ
బనిచి బొంకైన ననుమాన పడు విభుండు. ౧౧౬

క. నాచెలి యశోకకలికయు
నాచేసిన చేఁతతెఱఁగు నరపతి యడుగన్
వే చెప్పెనేని నక్కట
యేచాఁద మొనర్చుదాన నేనిటమీఁదన్. ౧౧౭

వ. అని చింతించి యనంతరంబ యొక్కెడం గాంచి శివప్ర
లింగంబున భాగీరథ్యభిషేకంబును దివ్యాన్నప్రసాదంబును
నరబలియు నొసఁగిన బ్రహ్మాంతి యనుకంబు ముక్తికతోఁ
సేచే ఇంటి నని యశోకకలికతో నరబలి ప్రకారంబు చెప్పక
తక్కిన విషయంబు చెప్పి శివలింగస్థానంబునకుం బోకొని చని
సోమకుంచి వధియించి యీయాపద నిర్వహించెద నని ని
ర్ణయించి యప్పాలంతితోఁ గం జెప్పవలయు వార్తలు చెప్పి
ప్రతీహారపాలాధ్యక్షుం డగు వృద్ధు రావించి. ౧౧౮

సీ. వసుమతీశ్వరునకు జ్వరము మానంగ ర
క్షావిధికృత్యముల్ సలుపవలయు
నర్ధరాత్రమునప్పుఁ డాయనాకెవ్వరు
వెడలివచ్చిన నడ్డుపడకుఁ డనుచుఁ
జెప్పి పోవఁగఁ బంచి చెలియును దానును
భాగపూజాద్రవ్యచయముఁ గొనుచు
నసిహస్త యై శివస్యహారగృహమ్మునకేఁగి
యజరక్తమజ్జనం బాచరించి
యమ్ముతివ శంభుపూజ సేయంగఁ బంచి
తత్పరతఁ బూజ యొనరించుదానిఁ జేరి
తద్గళము ద్రేయుటయు హేతిధారదప్పి
దైవవశమున నడ్డంబు దాఁకుటయును. ౧౧౯

వ. అశోకకళికయు జెగ్గిలి యగ్గలంపు హాహారవంబు లెసంగ
గుడివెడలి పఱవం దొడంగిన. ౧౨౦

క. తలయును జీరయు వీడఁగ
బలుబూతము వోలె వెంటఁ బడి చనుదేరం

దలఁకుచు నశోకకళికయు
నెఱుఁ గెత్తి విషాద మడర ని ల్లువెలికేఁగెన్. ౧౨౧

గీ. పాముగుడిలోని భూతము గూడముట్టి
వెన్నడింపఁగఁ బోఁడఁగె నో యన్నలార
కంటిరే యని మొఱవెట్టఁగాఁ బోడంగ
నయ్యెలుఁగు విని తలవరు లడ్డగించి. ౧౨౨

వ. వస్త్రాపవరణ యు నాలంబకేశభార యు నాభీలకరవాలహస్త యు నై దానివెంటం బఱతేర వారలు గనుంగొని భూతం బనుచుం బొదివి పలుతునియలు గావించిన. ౧౨౩

గీ. అయ్యశోకకళిక యార్తనిర్ముక్త యై
యంతిపురము సొచ్చి సంతలోన
శంభుపూజకతన జ్వరముక్తుఁ డై యున్న
మనుజవిభునిఁ జేరి వినత యగుచు. ౧౨౪

వ. కమలమంజరి చేసిన కపటకృత్యం బెఱింగించిన నరసి వెఱఁగుపడి హంసావళివలని బలవంతం బైన వలవంత నొందుచు నాక్షణంబున మంత్రుల రావించిన నందఱుం జింతాక్రాంతు లై యున్నసమయంబున భీమభటుండు జ్యోతిశ్శాస్త్రపారగుం డైన వసంతకు నాలోకించి ప్రశ్నం బడిగిన.

గీ. అనలనిహతిఁ బడదు హంసావళీకన్య
సేమమున నరేంద్రుఁ జేరు ననిన
మదిఁ దలంకు మాలి మాళవాధిపున క
వ్వార్తఁ జెప్పెఁ దగినవారిఁ బనిచి. ౧౨౫

వ. భీమభటుండు దిగ్గన లేచి మననేర్చువిధంబున మాళవేంద్ర

కన్య నరయుంతము రం డని చెలులం బోఁదఁ గొని యుత్సాహ
సంభ్రమంబునం జని. ౧౨౭

మ. సరసానందన సత్కళాగమపరిజ్ఞానార్కృష్టకందార భా
స్వరనానారసభావనిర్మథనభోజహ్నాస విద్యానికం
తరగోష్ఠీజగదేకమల్ల బహుశాస్త్రగ్రంథసిద్ధాంతవి
స్తరవిజ్ఞానకవిత్వరత్నకలనాసర్వజ్ఞసోమేశ్వరా. ౧౨౮

క. పీఠాపురపురపతి
వేణీశ్రీప్రసూనవిహారసన్మధుప
శ్రేణీనానాకర్ణన
ఘ్రాణీకృతనేత్ర హారితగోత్రపవిత్రా. ౧౨౯

లయగ్రాహి.

చంద్రరుచిరానన మహేంద్రబహుభోగ భుజ
గేంద్రమృదుభాషణ దినేంద్రసమతేజా
నాంద్రశుభలక్షణ ధనేంద్రధనవైభవ మృ
గేంద్రపటువిక్రమ గిరీంద్రనిభధైర్యా
మంద్రజయఘోషణ ఖగేంద్రజవవాహన శి
ఖీంద్రఘనదాన మనుజేంద్రహితకృత్యా
సంద్రమతిజృంభణ రతీంద్రలలితాంగక గ
జేంద్రబలబంధుర కవీంద్రనుతకీర్తీ.

గద్యము. ఇది శ్రీమద్వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర హరి
తసగోత్ర పవిత్ర సుకవిజనమైత్రీ విధేయ అన్నయనామధే
యప్రణీతం బైన షోడశకుమారచరిత్రంబు నందు సప్తమా
శ్వాసము.

---

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## అష్టమాశ్వాసము.

క. శ్రీభాసమానసనానా
వైభవ జయలాభ.........ననితాంత
స్వాభా......తసౌరభ
శోభితపాండిత్య యన్నసూరామాత్యా. ౧

వ. .........మంబులు గడపి విరహతాపోపశమనార్థంబు మహీతలనాథుండు శీతలచ్ఛాయ నొక్కరుండును నాసీనండై యుండి యశోకకలిక నచ్చటికిం బిలువం బంచి సమీపంబున నునిచికొని హంసావళి యేమయ్యె......... ౨

క. భూనాథ కమలమంజరి
తో నాఁ డటు నేను నరిగి తుదముట్టంగా
మానుగ నవ్విధ మంతయు
నే నెఱుఁగుదు విన్నవింతు నేర్పడ నీకున్. ౩

వ. సకలలోకాభిరామం బగునారామారత్నం బొక్కనాఁడు రత్నాగారంబున కరిగి తదీయమణికుడ్యభాగంబునందు. ౪

చ. నరవరముఖ్య నీ దయిన నవ్యమనోహర మైనరూపు చిత్తరువున వ్రాసి యున్నఁ గని తద్దయు వేడ్కలు నివ్వటిల్లఁ

గా, వరుసున జెప్పనెట్టిక చలాకృతిగుం.....వేషధానుజి
త్తరువునంబోలె నుండె వనితామణి రాగసమోహమగ్న యై.

వ. అప్పుడు—

సీ. సుదతి యారూపంబు చూచినయప్డైన
 లీలమై జెప్పలు వ్రాలనైచు
భామ యారూపంబు పలికినయప్డైన
 నేటుక మాటలు వినంగఁ గోరు
నింతి యారూపు దన్నెలయించినప్డైన
 నఖ్తిఁ జేరంగఁ జని సప్పళించుఁ
గాంత యారూపంబు గదిసినయప్డైన
 నాలింగనము చేయ నాససేయు
నిష్ప్రభమునఁ జిత్త మెంతయుఁ దగిలినఁ
దన్ను మఱచి యుండె దవళనయన
లలితచిత్ర మగుటఁ దెలిసియుఁ దెలియక
మరుఁడు దన్ను మిగుల మరులుకొలుప. ౭

వ. ఇ ట్లత్యంతసుందరం బగు నచ్చిత్రరూపంబుఁ జూచి యిచ్చ
ట నీరూపం బెవ్వరు వ్రాసి రని యడిగిన సకలవిద్యావిశార
దత్వంబు... ... ... ౮

చ. .... ... ... ...
... ... ... నొప్పెసలార రక్తచం
దనమున వ్రాసి యింతి మఱునాఁడు ప్రమోదము నివ్వటి
ల్లఁగన్. ౯

క. చిలుకఁ బిలిపించి రసవ
త్ఫలములు పసదనము నిచ్చి తథ్యసువర్ణో
జ్జ్వలచేల మొసఁగి సద్గుణ
కలితా పురుషార్థనిధివి గమ్మని పలికెన్. ౧౦

క. ఆర్యనుతిపాత్ర మగున
య్యార్యఁ జదివి చూచి మెచ్చి యాశుకమును రూ
పార్య వగునీకు శిక్షిచం
ద్రార్యమనయనసము నమ్మహాత్మునిఁ దెత్తున్. ౧౧

వ. అని పలికి సముచితప్రకారంబున వీడుకొని రాజశుకంబు చ
నుటయు నది యవశ్యంబు నిన్నుఁ దెచ్చు నను నాస నూఱ
డి యనేకదివసంబు లెదురుచూచి రాక తడసిన నొక్కనాఁ
డమ్మంజువాణి కమలమంజరి దెసఁ గనుంగొని. ౧౨

క. ఆచిత్రాకృతి పతి దృ
గ్గోచరుఁ డగుటయు నగల దొకో యొకనాఁ డా
రాచూలిని నిట్లన వల
రాచయురులఁ బెట్టు నొక్కొ రాచిలుక చెలీ. ౧౩

క. మెచ్చు నొకో యార్య యిచ్చకు
వచ్చు నొకో రాజశుకమువాక్యము లతనిం
దెచ్చు నొకో చిలుక యెంతకుఁ
దెచ్చు నొకో మరుఁడు నన్నుఁ బతిఁ దేకున్నన్. ౧౪

వ. అనినఁ గమలమంజరి యి ట్లనియె. ౧౫

క. నీచెలువము రసికాగ్రణి
యాచిలుక నుతింప మిగుల నరయక యుండఁగా

నేచిత్తమునాఁడే పతి
వోచెలి యిట్టు లేల చింత నొందఁగ నేఁటన్. ౧౬

వ. అనిన నమ్మాటలకు నెమ్మనమున నమ్మిక జనింపకున్న నమ్మె
లఁత నచ్చెలి యాలోకించి. ౧౭

ఉ. ఓజలజాక్షి నీవు నను నూఱడఁ బల్కెదు గాక నమ్మునే
రాజశుకంబు, పిన్నవిడలి కమ్మనిన న్నను నేల, నమ్మహా
రాజున కిప్పుడోర్చి యిట్టు రా మన మెక్కడ నాతఁ డెక్క
డే, యోజఘటింపఁ గార్యము శుకోక్తుల నిట్టివియూన నె
ట్టినో. ౧౮

క. అని పలుమఱుఁ దలపోయుఁగ
దినదినమున కంగజుండు ధృతి మాలింపన్
మనమునఁ గలఁగుచుఁ దేజంచు
ఘనపరితాపంబుచేతఁ గ్రాఁగఁ దొడంగెన్. ౧౯

మ. ప్రిదిలెం జేతులకంకణంబులు నటిబృందంబుపై మచ్చికల్
వదలె న్మత్తమధువ్రతారవముల న్వాసంతికావహ్నిచే
నదలెన్ ధైర్యము చిత్తసంభవశరవ్యాప్తిన్ మనోజ్ఞంబు గ్ర
క్కదలెన్ మైఁబరితాపవహ్నిపొదలెం గంజాతపత్రాక్షికిన్.

వ. అవ్విధంబు గనుంగొని కమలముఖి చిత్తంబునఁ జలింప నె
చ్చెలి నవలోకించి. ౨౧

గీ. చిలుక వెంటన వలరాచ చిచ్చు దరిలి
యకట పన్నిదు చల్లిన నాఁకిపోదు
పుష్పధూళి పైఁ బోసినఁ బొనుఁగుపడదు
కొమ్మ నేక్రియ నోముదు నమ్మలార. ౨౨

గీ. ఇందులోన నెవ్వారికి నెఱుకలేద
యకల పూఁబాన్పు చేసెద మనుచుఁ దెచ్చి
భావసంభవునమ్ములపాన్పుమీఁద
ముదితఁ బెట్టినవారలు మోసపోయి. ౨౩

వ. అని యయ్యింతివలవంతసూచి నెచ్చెలులు పలుమాటల వ
లరాజు నుద్దేశించి. ౨౪

గీ. పద్మభవునిమీఁదఁ బంకజోదరుమీఁద
హరునిమీఁద వేసినట్టిశరము
నబలమీఁదఁ జాల నదయత నేయంగఁ
బంచబాణ నీకుఁ బాడి యగునె. ౨౫

వ. అని పలికి యేమిట నమ్మగువమేన నుద్దీపించిన మదనతాపం
బు వాయకున్న నిట్లనియె. ౨౬

చ. హరునిటలాగ్ని రూపఱియు నంగజుఁ డప్పుడ పుట్టె రాఘు
వేశ్వరుఁడు శపించినం బికరవంబులు గ్రమ్మఱఁ గల్గె రా
హు నిష్ఠురగతిఁ బట్టి మ్రింగినను సోముఁడు వెల్వడివచ్చెఁ
జెల్లఁబో, విరహులఁ బొందియున్నశని వీడియు వీడద యేమి
సేయుదున్. ౨౭

వ. అని పలికి యిందువదనకు మనసేయు చలిమందుల మదన
తాపంబు దీపించె నింక నివి వల దని శిశిరోపచారంబుల పని
చాలించి చింతింపం దొడంగిన నక్కమలమంజరిం జేరం జని.

మ. తరుణీ నే నొకసిద్ధపుంగవుని నత్యంతంబు సేవించి యే
నరు లేరూపులు సూడ నర్థిపడినం దద్భావము ల్గొంతసే
పరుదారం బొడసూపవచ్చువరవిద్య న్వేఁడికొన్న న్మనో
హరభావస్ఫురదింద్రజాలవరవిద్య న్నాకు నిచ్చెన్ దయన్.

క. కుహనాలంతికిఁ గమలాకర
రూపముఁ దద్దివ్యవేత్రి చూపినలాగుం
జూపుడుఁ దాన మనస్సం
తాపంబు శమించుఁ దెలివి దలఁకొను దరినన్. ౩౦

క. ఆ చెలువుని చిత్రాకృతి
చూచినయట్లన రూపుచూచిన మరుచే
చేసంద మగునొ మూన్ప న
గోచర మున్మాదవృత్తి గూరినయెనిన్. ౩౧

క. అనునంతటఁ గమలాకరుఁ
డనుభూపతి వాహినీచయంబులతోఁ జెం
పెనయఁగ వేత్రవతీవా
హినిదరి విడిసె నని పౌరు లెల్లఁ జెదరన్. ౩౨

క. నీ వరుగుదెంచి తని హం
సావళి దెలిపొందుటయును నానందలస
ద్భావమున నంతిపురమున
నావెలఁదిని గొనుచు బోటు లరిగెడు నంతన్. ౩౩

గీ. అడుగఁ బుత్తెంచుటయుఁ గమలాకరునకుఁ
బుత్రి నని నిశ్చయము చేసె భూమిపాలుఁ
డనుచుఁ బరిచారికలు చెప్పికొనఁ గడంగ
సతికి విధికృతి నాత్మ సంశయము పుట్టె. ౩౪

క. ఆకీరము చెప్పిన కమ
లాకరుఁడో యున్న రేంద్రుఁ డన్యుఁడొ యని చిం
తాకులతఁ గమలమంజరి
నేకడకుం బనుప మనుఁడు నిక్కృతి యొనర్చెన్. ౩౫

క. కమలాక్షికిఁ బ్రాణము ప్రా
ణము లత్త్రాజి కీడుసేయునా తలఁపఁగ నే
కమనీయమూర్తి విభవము
కమలాననబాము మాన్పఁగలిగెఁ గుమారా. ౩౬

క. నెవిడిసియున్నయది హం
సావళి విహరించు తోఁట యనవరతంబున్
భూవల్లభ యం దాడుదు
మావనితయు మేముఁ జాల ననుమోదమునన్. ౩౭

సీ. ఈచంపకముపొంత నీమావిక్రీనీడ
మానినీరత్నంబు మరుని నోఁచె
నీమాధవీలత నీయశోకముతోడ
నబ్జలోచన వివాహంబు చేసె
నీకేళకుళిలోన నెలనాఁగ ప్రోదిరా
యంచలకవల నిందించి యాడె
నీపువ్వుఁబొదలలో నీరత్నవేదిపైఁ
జెలువ బొమ్మలపెండ్లి చేసె మున్న
భూపనందన యీసారపొన్నపొంత
ముత్తియంబులపందిరి ముదిత వెట్టెఁ
బ్రేమ నాడెడుచోట నీచాయ చూపె
మానవేంద్రునిహృదయంబు మరులుకొనఁగ. ౩౮

సీ. ఈహంసయానంబు నింతయొప్పయి యున్నె
యతివ యిక్కడ గెడయాడెనేని
యీపుష్పములతావి యింతలెస్సయి యున్నె
సుందరిమైతావి సుడిసెనేని

యీచిలుకలమాట లింతయుం బయి యున్న
నెలఁదికిన్నరిపలుకు లింకేమి
యీతేఁటిగమిచాయ యింతెయుఁ బ్వయి యున్న
సుదతివేనలి చూచి చూతుమేమి
ప్రాపుఁబోఁడి హంసావళి యీవనమున
వేడ్క విహరింపకుండుట యేది కెల్ల
నింపు సమకూరెఁగాక యయ్యింతి యున్న
మనకు నింపుఁ జేయునో యిది మానవేంద్ర. ౮౯

వ. అనినమాటలు విని యనురాగంబు నివ్వటిల్ల. ౯౦

సీ. పొలఁతి కౌఁగిటఁ జేర్పఁ జూచి నెత్తావుల
క్రోవి యైనదియె యీక్రోవి యొక్కొ
మానినిగండూషమధువృష్టిఁ గనఁ జూచి
పొగడ నొప్పినది యీపొగడ యొక్కొ
నలినాక్షిపదతాడనంబునఁ జూచి వి
శోక మైనదియె యశోక మొక్కొ
యెలనాఁగ మెఱుఁగుఁజూపులఁ జూచి భూజాత
తిలక మైనదియె యీతిలక మొక్కొ
యివ్వనములోన నిన్నియు నెఱుఁగకున్నఁ
దరుణికౌఁగిటఁ జేర్చిన కురవకంబు
నాకుఁ జూపినఁ బరిరంభణంబు చేసి
నట్టులైనఁ గృతార్థుఁడ నగుదు నబల. ౯౧

క. అని యంత మదనతాపము
ఘన మగుటయు సైఁపలేక కాంతా సినే

క్షినయింద్రజాలవిద్యను
వనజాననరూపు చూప వలయు ననుటయున్. ౭౨

వ. తనవిద్యాప్రభావంబున రాజకన్యమోహనాకారంబు దృగ్గోచరంబు గావించిన, ౭౩

క. వనజాస్యమోహనాకృతి
కనుఁగవ కతికౌతుకంబు గావించుటయున్
మనమున మాయారూపం
బని తెలియఁగ మఱచి చాల ననురక్తుం డై. ౭౪

చ. తళతళఁ బర్వు క్రొమ్మెఱుఁగుఁదండములం బురణించుమేని
నుం, దళపమునందుఁ(?) జూపులు మనంబునఁ జిక్కెనఁ గ్ర
మ్మఱింపలే, కలికులవేణి తెప్ప యిడ కానరపాలుఁడు సూ
చుచుండె ని,శ్చలమతిఁ గాముతూపులకు జానుగ నిల్చిన దె
ప్పమో యనన్. ౭౫

సీ. నెత్తమ్మిరేకుల నెచ్చెలులై యొప్పు
మృదుపదంబులమీఁద మెలఁగిమెలఁగి
నునుమంచు మించునం గనకకుంభమ్ముల
కెనయైనచనుఁగవ యెక్కియెక్కి
కందని యిందుని యందంబు నొందిన
చిఱునవ్వు నెమ్మోముఁ జెందిచెంది
మెఱచినతొలుకారు మెఱుఁగులకవలైన
చెలువుఁజూపుల మీఁదఁ బొలసిపొలసి
ముదితయనుపమానమోహనాకారంబు
చాల మరగి యానృపాలుచూడ్కి

నదె తల చూపె నీలాలక యని డాసి
తుమ్మెదపొద యైనఁ దూలఁబోవు
నదె చీరెఁ జేసన్న నబ్జాక్షి యని చేరి
యెలమావి చిగురైన నిచ్చఁ గలఁగుఁ
దడవి కానని చోటను దడవఁబోవు
నేల పొడసూపి మాయమై తివ్విధమున
నలఁపఁదగునె హంసావళి యనుమదూఱ
భావజన్మంబు గాఱింప భూవిభుండు. ౫౦

వ. ఇవ్విధంబున మన్మథోన్మాదబాణవిదారితమానసుండగుచుఁ గొంతతడ వవ్వనాంతరంబున జరించినంత నత్యంతసంభ్రమంబున వసంతకుం డచ్చటికిం బఱతెంచి హంసావళీకన్య యున్నది యనుపలుకు మున్నుగా నన్నరనాథునితో ని ట్లనియె.

సీ. అధిప హంసావళి యాబూరుగున నుండ
కొకపువ్వుఁ బొదలోన నుండి రాత్రి
యనలంబుచేత నేయాపదఁ బొందక
బ్రదికియుండంగఁ బ్రభాత వేళఁ
బూవులకై పుష్పలావిక లేగి యా
కోమలిఁ గాంచి తోకొనుచుఁ బోయి
యంతఃపురంబున నడలెడుతల్లియు
జనకుండు నున్నెడ కనుచుటయును
వార లెంతయు వెఱఁగంది వచ్చి గ్రుచ్చి
యత్తి కౌఁగిటఁ జేర్చి యందంద వేర్చి
క్రమ్మ కన్నీటితో డుత నుమ్మలించి
యమ్మ బ్రదికి యేగతి వచ్చితమ్మ యనుచు. ౫౧

గీ. కన్న నేరు మఱిచి కన్నియ మారాజ్ఞి
పాపజాతి బోటిపాటుఁ జెప్పి
నేఁడు పెండ్లి యంచు నెమ్మి వృట్టిగఁ బిల్చి
వారె మనకుఁ జెప్ప వచ్చె ననిన. ౫౩

వ. ఆనందకందళితమానస యయ్యె నప్పుడ మేల్కొని మాలికనుం
ద్రుంచు విభవంబున నక్కమలాననం బోకొల్పెను. ౫౪

క. తొడవులు తనులతఁ దవిలినఁ
గడునొప్పయి యుండెఁ దొంటికంటెను దనితోఁ
బడఁతుకయంగము తొడవులు
తొడవని మొదు పలుకఁ బలుకఁ దోడనై మెఱయుఁగా. ౫౫

వ. ఇవ్విధంబున నచ్చెలు లచ్చెలువకు శృంగారంబు చేసి రయ్య
వసరంబున నక్కడ. ౫౬

సీ. వాహాననికరుంబవల్లకీజ్యాంఛిత
కాంచనకింకిణీక్వణనములును
మాణిక్యఘండనమండితగాణిక్య
మంజులమంజీరశింజితమును
వాంశికవైణికవందిబృందానేక
వేణువీణాస్తుతక్వాణములును
లాసికమోహనలాస్యలీలోచిత
మర్ద్దళమురజాదిమహితరవముఁ
గర్ణచామరసౌవర్ణకర్ణలలిత
వర్ణకంబళభూషణవ్రాతకలిత
దంతిఘంటారవంబులుం దనరుచుండఁ
గదలెఁ బెండిలికొమకు వేదములు దలిర్ప. ౫౭

ఉ. అంతఁ బేరంటికాజనము లల్లన వచ్చిరి రాజు ముందటం
గ్రంతకు నైనవస్తువులఁ గాంచనపాత్రలఁ గొంచు సంతతా
తాంతలతాంతకోరకవిలాసమనోహరపల్లవావళీ
కాంతిఫలావలుల్ దనరఁ గామమనోహరవల్లికాకృతిన్.

సీ. ధమ్మిల్లములఁ బువ్వుదండలచెలువంబు
సూచకప్రభలును సొబగు నొంద
నలికకస్తూరికాతిలకవిభ్రమములఁ
గుంతలరోచులఁ గొమరుమిగుల
రంగార నలఁదిన యంగరాగంబులఁ
జీనాంబరంబులుం జెలువుమిగుల
భాసురమోహనాపాంగమరీచులఁ
గర్ణభూషణములుం గలసి పెరయ
నంగదీప్తులఁ దొడవులు నసఁగి పెనఁగి
విదితపార్వతీకల్యాణవిభవవినుత
గానములు కర్ణపర్వము ల్గాఁగ నడచు
పేరటాండ్రయందంబులు బెడఁగుఁజేసె. ౫౯

వ. ఇవ్విధంబున విభవంబులు మెఱయఁ బురంబుం బ్రవేశించిన వైభవసురేంద్రుం డైన మాళవేంద్రుండు మించినవేడ్క నెదురు చనుదెంచి తోడ్కొని పోవం దదీయమందిరంబు ప్రవేశించిన యనంతరంబున సర్వజనంబు లయ్యేలనాఁగ వివాహవేదికాతలంబున నునిచి గంటవడం బెత్తించి యయ్యెడకు నక్కుమారుం దోడ్కొని యరిగిన. ౬౦

క. ఉండిరి కాంతయుఁ బతియును
గండపడము మాటునందుఁ గడునింపులతో

నిండిన వేడ్కలు దనరఁగ
గొండ్రాపలం జూడఁ గన్ను లబ్బిళ్లారన్. ౬౧

వ. అంతం బురోహితముంగాచారాంతరంబ యుపాహారాత్రిక
వస్త్ర శోభమునూహాత్రంబునం దెరయెత్తించిన. ౬౨

సీ. లజ్జఁ గొంపోకసేపు లలనస్మృష్టాలముల్
జెప్పలలోనన యుప్పతిల్లు
విప్పులవిడెఁ బర్వి విభునివీక్షణములు
మెలఁతమోహానమూర్తి మీఁదఁ బర్వఁ
దనరెడు వేడుకఁ దన్వంగి చూపులు
చెలువుని మోముపైఁ బొలసి మగుడఁ
జూపులు దాకొన నుదకీలలామంబు
లలితంపు సిగ్గునఁ గళవళించు
నప్పుడు దమచందములు చూచి యలరుఁబోడ
యలరుఁబోఁడుల సరసోక్తు లమృతరసము
సోన లొలికించె నెంతయు సొబగుమిగిలి
తమకు నప్పుడు చెవుల కుత్సవ మొనర్ప. ౬౩

సీ. పళ్లెరంబుల నున్నప్రాలు దోయిట ముంచి
పాణిపద్మంబులు భ్రమలు నిండ
సేసలు వెట్టంగఁ జేతు లెత్తెడుచోటఁ
గరమూలరోచులు గ్రమ్ముదేర
చే(తెం)ట్లు దెచ్చుచో సితకటాక్షంబుల
మించి సిరెండల ముంచికొనఁగఁ
దలఁబ్రాలసందడిఁ జెలువపయ్యెద వాసి
యిఱిచన్నుఁగవకాంతి గిఱికొనంగఁ

దానఁ జయ్యన ధవళాక్షతలు ధరించి
పాలఁతిమాళిపై నినుపారఁ బోయ మిగులఁ
బాటలాసితసితహరిత్ప్రభలు దనరఁ
బాటవము లేక పతి తొట్రుపాటు నొందె. ౬౪

క. తలఁబ్రాలు వోయఁ దత్కర
జలజంబులపొందు పతికి జలజాననకున్
దళముగ సకలాంగములను
బులకాంకురవితతి నారు వోయుచు నుండెన్. ౬౫

వ. ఇవ్విధంబున మహోత్సవానందకందళితమానసు లైన యా దంపతులకు హోమానంతరంబ మాళవేశ్వరుం డనేకకరితురగరత్నభూషణచీనాంబరాదిమనోహరధనం బరణం బిచ్చి వందిమాగధాదిజనంబుల కభీష్టధనంబు లొసంగి యుఁదటు నన్నపానాదులం బరితృప్తులం జేసి దంపతుల నర్హామందిరంబుల ననిచె నయ్యవసరంబున. ౬౬

సీ. అబ్ధీశుసాంధ్యసేవాభిషేకమునకు
జలధి ముంచినహేమకలశ మనఁగ
జలధియుద్యానభూజంబున రాలిన
జంధురపరిపక్వఫల మనంగ
నంబుదదంతి గోరాడ నంబుధిఁ బడ్డ
యపరాద్రిధాతురాగాశ్మ మనఁగ
వరుణకుటుంబినీకరతలంబునఁ దప్పి
పడినమాణిక్యపుబంతి యనఁగ
వారుణీసక్తుఁ డై జాఱి వనజబంధుఁ
డపరగిరిమీఁదఁ గాల్జాఱ నబ్ధిఁ బడియె

వారుణీసక్తులై పెఱవార లెల్ల
చక్క నిలువంగ లేక్తుర నిక్క మరయ. ౬౭

క. దినలక్ష్మి యినుఁడు వరుఁడును
సహగమనము సేయఁ బశ్చిమాచలమున కొ
క్కినయెఱ్ఱమంటలపోలిక
ఘనసంధ్యారాగరుచులు గడు నొప్పారెన్. ౬౮

గీ. మించె నెఱసంజ లడఁచి యామినిఁ దార
లల్లనల్లనఁ దోఁతెంచె నెల్లు నాఁగ
మాలినంబుగ నంబరానోకహంబు
చిగురు నిండారఁ బొట్టి పూచెనో యనంగ. ౬౯

గీ. జలరుహములు సూర్యబల మేమియును లేమిఁ
జంద్రుఁ డొప్పుచుచిక్కఁ జాలఁ గుందె
గ్రహబలంబు లేనికాలంబు నెంతటి
సిరులు గలుగువారుఁ జిక్కు వడరె. ౭౦

సీ. మధుపసంఘంబులు మట్టి మల్లాడుచుఁ
గువలయంబులు చూఱఁగొనఁదొడంగె
ద్విజకోటి సన్మార్గవిహారణంబులు దక్కి
యుడిఁగి కుజాతుల నాశ్రయించెఁ
బతులచేరువ లేనిభామల డగ్గఱి
మారుండు భీతి నిండారఁ జేసెఁ
గులశీలవిధములఁ దలఁపంగనేరక
జారచోరావలి సంచరించె
మహి వివేకులు ఘనతమోమార్గులైరి
యొకవర్ణత వాటిల్లె లోకమునకు

నధికతేజస్వి యగునినుఁ డస్తమింప
దివి యరాజకమై యున్న యవసరమున. ౨౧

ఉ. కాంతము లైన తామరలతావులు సేవలు దక్కి పోవఁగా
నంతట వచ్చి చొచ్చె మధుపావళి గ్రోలుచు సోలుచుండఁ
గాఁ, గాంతవనాంతరాంతరనికామనివాసవిజృంభమాణసా
యంతనమల్లికాకుసుమహారిమనోహరసౌరభావలుల్. ౨౨

సీ. ఇది చనుదెంచెనే నేగరా దనియొక్క
తోయజబంధుండు తొలఁగిపోయె
నిది తను రూపఱఁ బొదలెడు ననియొక్క
రాజు రయంబున రాక తడసె
నిది వెనుదగిలిన నేగరా దనియొక్క
చుక్కలు దీనిలోఁ జొచ్చి వెలసె
నిది క్రమ్మంగు ననియొక్క యిప్పుడు దీపరూ
పమున నిండులు సొచ్చెఁ బవనబంధుఁ
డనఁగ దెస లెల్లఁ గస్తూరి నలఁదినట్లు
మింట నెల్లను గాటుక మెత్తినట్లు
నుర్వి గలయంతయును నీలి నూంచినట్లు
నంతకంతకు నగ్గల మయ్యెఁ దమము. ౨౩

వ. అయ్యవసరంబున. ౨౪

సీ. సిరితోడఁబుట్టువు చెంగల్వచెలిపొందు
ప్రొద్దుసంగడము తన్వునకు నెలవు
చీఁకటిమూఁకలఁ జెండెడినెఱరాతు
మున్నీటి నబ్బించు ముద్దుఁబట్టి

యమునపాలికన్న ప్రసన్నమకేంద్రు వెన్నని
వియ్యంబు తామరసకులకొఱఁ
ముకుటాటీతలపూవు ముకుటలరేఖరిక
వెన్నెలకందువు వేల్పుటన్న
కూడి పాసినవారలకుఁ జెదిగులు
పాసి కలసినవారలపాలియింపు
పొదుపుఁగొంపున నెంతయు బెడఁగు నొంది
మన్మథునిమామ యనుచందమామ పొడిచె. ౨౫

క. ప్రాక్పదిని పానవట్టమై పొలుపు మిగులఁ
జన్మనాగలింగము సోమఁ బ్రబలె రాజు
పూజ చేసినసవకంపుఁబూవు లట్టు
లుపరితలమునఁ దారక లొప్పు మిగిలె. ౨౬

చ సలలితలీలఁ బ్రాగ్వనితఁ జాలఁగ రాగముఁ బొందఁ జేసి
యిం, పొలయఁ గుముద్వతీసతికి నుల్లసనం బొదవంగఁ జే
యుచు, న్విలసితతారకాంగనల వెన్నెలగందపుఁబూఁతచే
తఁ బె, ల్లలరఁగఁ జేసె నప్పు డమృతాంశుఁడు దక్షిణానా
యకాకృతిన్. ౨౭

(గ్రంథపాతము)

... సంతోషంబు నిగుడుచుండ
వైభవముతోడ శృంగారవనము సొచ్చి

సీ. మంజీరమంజుల శింజితంబు సెలంగ

... ... ...

... ... లవిందులుచేసి
పూవుఁదీఁగెలపొంతఁ బొలసిపొలసి

నెఱపార నింపువెన్నెలచల్లు చూపుల
సొంపార మాఱిమ్రొక్కు చూచిచూచి
... విరులువేడుకఁ గోయఁ
గరము ... ...
... టలోఁ గరమువేడ్కఁ
దిరుగుచున్నట్టి నిర్జరతరుణు లనఁగ
నవవికాసంబు గతులకు నవకమొసఁగ
వనములోపలఁ దిరిగిరి వనజముఖులు. ౭౮

సీ. పొగడంగ ... ...
... ... దుచువారు
నోపాటలాధర యీపాటలము నీవు
ముట్టకు మని యొట్టు వెట్టువారు
రాజాన యనుచు నీరాజానన దొలంగ
దటుచూడు దీని ... ...
... ... లేవె
చెలు లిందు రండని చీరువారు
మెరయుపువ్వులు గనుఁగొని మెచ్చువారుఁ
జిలుకబోదలఁ బట్టంగఁ జేరువారు
నగుచు నెంతయు వేడ్కల నతిశయిల్ల
... ... ... ౭౯

సీ. ... నొకకొంత మోపి నిక్కుటయును
మంజీరములు తొలిమాటసలుప
వామకరంబుల వరశాఖ లూఁదిన
మణిముద్రికలదీప్తి మాఱుమలయఁ

బూవులకంపునఁ బో ...

... ... ...

గరములల్లన యెత్తి విరులు గోయఁగఁ బూన
దోహ్నలకోమలు తొంగలింపఁ
గుచములొకటి నొకటి మీఁది క్రొత్తనెగయ

... ... ... ...

వలుల జాడలు గనఁబట్టి వెలయుచుండ
... ... కేలిసలిపిరప్పుడు. ౮౨

ఉ. సన్నపుఁగొనమీఁద వలిపమ్మలబ్రేఁగు ఘనంబు నెవ్వడిం
దన్నకు మమ్మ యోపికవతామరసానన యంచు లేతతోఁ
దన్నొకబోటి ... ... ...
... ... ధజనతాకృతలోకమునయ్యశోకమున్.

సీ. ఎఱసంజవన్నె నదేలకో యెఱసంజ
గాదిది చిగురాకుగముల పెల్లు
చిగురాకుపైఁ దమ్మిరేఁశి యిట్లడరునే
తమముగా ... ...
... ... ... డునే
తారక ల్గావివి కోరకములు
కలికలమీఁద వెన్నెల లుద్భవించునే
వెన్నెల గాదిది విరులసొబగు
లనుచు ముగ్ధలు వలుకంగ నతివిదగ్ధ
లల్ల నవ్వుచుఁ దెలుపుదు ర ...

... ... ...

... లు దిక్కులనం జూపువజపునప్పుడు. ౮౩

క. డోలాలీల లోనర్చుచుఁ
గేళీసదనంబులందుఁ గ్రీడింపుచుఁ గ్రీ
డాలాపములకు మెచ్చుచు
నాలేమయుఁ బతియు ... ... ౮౩

సీ. (నీకటాక్షంబులు నెర)సిన యెడలెల్లఁ
గలువలు పూచిన కరణిరుంచు
నీమేని నెత్తావి నెగడిన నేపూవు
లైనను మంచి వైనట్లు దోఁచు
నీయంగములకాంతి నిండిన లత లెల్లఁ
గనకంపులతికల (కరణి నెలయు)
... ... ...
... జిగురుల పోల్కినుండుఁ
దెలిసి తెలిసి కోయనకాని యలరులెపుడు
గోరి విచ్చలవిడిమాకుఁ గోయరాదు
నెలఁత నీపొత్తు గలయము నేఁటి కనుచుఁ
బొలఁతినొక్కతె ... ... ౮౪

గీ. ... ... కాలువ ల్దాఁటి దాఁటి
యొసఁగు పుష్పాడితిట్టల నెక్కి యెక్కి
కోరి దవ్వుల పువ్వులు గోసి కోసి
యలసియూను మానకు... ౮౫

ఉ. ... ... ...కమలాకరుఁ డావనకేళి మాని యు
ప్పొంగెడు వేడ్కతోడఁ బువుఁబోఁడులుఁ దానును గూడి
భృంగచక్రాంగరథాంగముఖ్యవిహగావృతముం...
... ... ... ... ౮౬

... ... కౌశల్యవాదా
ప్రాసక్తార్థిప్రకర ర్థనాతీతదానా
హాసాంకూరస్ఫుటజయ— ౯౨

గద్యము. ఇది శ్రీమద్వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర హరితసగోత్ర పవిత్ర సుకవిజనమైత్రీ విధేయ అన్నయనామధేయప్రణీతం బైన షోడశకుమారచరిత్రంబునందు సర్వంబు సప్తమాశ్వాసము.

---

సిటీప్రెస్, కాకినాడ— 1934

కాకినాడ

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమున దొరకు

# కొన్ని పద్యకావ్యములు.

1. విప్రనారాయణచరిత్రము. రు 0 8 0
   చదలువాడ మల్లయ్యకవి.
2. చంపూరామాయణము. ... 1 0 0
   ఋగ్వేదికవి వేంకటాచలపతికవి.
3. చంద్రభానుచరిత్రము. ... 1 0 0
   తరిగొప్పుల మల్లనకవి.
4. శివతత్త్వసారము. ... 0 12 0
   మల్లికార్జునపండితారాధ్యులు.
5. శివరాత్రిమాహాత్మ్యము. ... 0 12 0
   శ్రీనాథమహాకవి.
6. నారసింహపురాణము. (ఉత్తరభాగము) 1 0 0
   హరిభట్టు.
7. కాళిందీకన్యాపరిణయము. (2 భాగములు) 1 4 0
   అహోబలపతికవి.
8. సింహాసనద్వాత్రింశిక. ... 0 12 0
   కొఱవి గోపరాజు.
9. శాసనపద్యమంజరి. ... 0 12 0
10. సాంబోపాఖ్యానము. ... 1 0 0
    రామరాజు రంగప్పరాజు.